## రచయిత యితర రచనలు

| | | |
|---|---|---|
| చీకటిలో చీలికలు | ... | (నవల) |
| అనురాగాలూ - అంతఃకరణలూ | ... | ” |
| రాగ రాగిణి | ... | (నాటకం) |
| అనంతం | ... | (నాటిక) |
| పతిత | ... | ” |
| విలువలు | ... | ” |

జారిపోతున్న లాగూ ఓచేత్తో ఎత్తి పట్టుకొంటూ వెనక్కి తిరిగి చూడకుండా రంయ్యిమని పరుగు తీశాను. అప్పటికే గంట ఆలస్యమయింది. తాతాజీ హుక్కా గొట్టం నింపితే ఓ అర్ధణా ఇస్తానన్నాడు కాబట్టి సరిపోయిందికాని మా గ్యాంగు అంతట్లోనూ నేను చచ్చినా వెనకబడను. మా తాతాజీ కొన్నాళ్ళు మిలటరీలో పనిచేశాడు. అప్పట్లోనే ఎక్కడో హుక్కాగొట్టంకొనుక్కొచ్చాడు-నాప్రాణంమీదికి. దాన్ని రెండు పూటలా నింపుతూ కూర్చోవాలి నేను. అయితే రెండుసార్లూ లంచం ముట్టడంమాటఅలా వుంచండి. లంచం లేనిదే ఏ పనీ చెయ్యనని బాబాయికి తెలుసు.

ఇవాళ మేమంతా ఓ పెద్ద ఆట ఆడాలనుకున్నాం. కొన్నాళ్ళ క్రిందట వాళ్ళ బామ్మతో ఊరెళ్ళిపోయిన రాజిగాడుకూడా ఇవాళ వచ్చేశాడు. వస్తూ వస్తూ వాడో రంగు రంగుల కత్తి కొనుక్కొచ్చాడు. అది చూడగానే- అసలు నేనే యీ ఆలోచన చెప్పింది- రాజుగారూ, పరివారం ఆట ఆడదామని. సరే నంటే సరేనన్నారు అంతా. కాని యీ వెధవ హుక్కా గొట్టం ఇవాళ నాకు అడ్డొచ్చింది.

మరో గంటకి వీధిలో పడ్డాను. ఆలస్యమయితే నాకిచ్చిన రాజుపాత్ర పోతుందికదా అని ఏడుపొచ్చేసింది. పరిగెత్తాను. కాని అక్కడికొచ్చేసరికి ఎవరూ కన్పించలేదు.

అప్పుడే రహస్య స్థలానికి వెళ్ళిపోయారన్నమాట- మరి వెళ్ళినా ఆటలో ఛాన్సు ఇవ్వరు. కళ్ళు తుడుచుకొంటూ- తాతాజీ హుక్కాని తిట్టుకుంటూ తిరిగివచ్చేస్తున్నాను. మరెప్పుడూ హుక్కా-గొట్టం నింపకూడ దనుకున్నాను.

అదే మైదానంలో దూరంగా ఓ కుర్రాడు కన్పించాడు. కాస్త ఉత్సాహం వచ్చింది. అటువేపు పరిగెత్తాను. పొడుగ్గా, సన్నంగా, తెల్లగా వున్నాడు. కొత్తవాడిలా వున్నాడు. వాడిలో వాడే ఏదో అనుకొంటూ గోళీలు విసురుతున్నాడు.

"ఇది పీతాంబరం పందెం అబ్బాయ్! నేనిప్పుడే చెప్తున్నాను. నల్లగోళీనాది. రంగుల గోళీ పీతాంబరానిదీను"-అంటూ నల్లగోళీ విసిరాడు. పీతాంబరం గోళీకి వెళ్ళి తగిలింది.

"హేయ్! గెల్చేశాను. ఇప్పుడు పీతాంబరంగాడి ఆట!" అంటూ ఒక కన్ను మూసుకుని రంగుల గోళీని విసిరాడు. నల్లగోళీ పక్కకొచ్చి ఆగిపోయింది. దాన్ని తీసుకుని చూపుడువేలుని పూరించి రంగుల గోళీని లపీమని కొట్టాడు. "చూసో-పీతాంబరం ఔట్!" అనరిచాడు. పీతాంబరం వాడి శత్రువయివుంటాడు బహుశా. వెళ్ళి నల్లగోళితో రంగుగోళీకి రంగున మొట్టికాయ పెట్టాడు. పాపం! గోళీ పక్కకి తుళ్ళిపోయింది!

ఇదంతా చూస్తూ నిలబడ్డాను నేను. వాడి మాటలు ఎలా వున్నా గోళీలు చాలా చాలా బావున్నయి.

మా దగ్గరివి మట్టివి. వీడిదగ్గర గాజుగోళీలు—చాలా పెద్దవి. కొండగచ్చకాయలంతవి వున్నాయి. చూస్తుంటేసంతోషం ఎక్కువయింది. లాగూను మరోసారి మీదికి లాక్కొని మోకాళ్ళ మీద కూచున్నాను గోళీల్ని చూస్తూ.

నన్ను చూడలేదు వాడు. చూసినా చూడనట్టు తన ఆట ఆడుకుపోతున్నాడు.

"ఈ గోళీలు ఎక్కడివిరా నీకు?"

"ఏయ్! ఆట మధ్యలో మాట్లాడకూడదని తెలీదూ నీకు? పో అవతలికి"

నాకు చర్రున కోపం వచ్చేసింది. ఇంకోణ్ణయితే చితక తన్నేసేవాడినే. కాని గోళీలు చూస్తూంటే నోరూరింది. మాట్లాడకుండా నిలబడ్డాను.

"నేనూ ఓ ఆట ఆడేదా?"

నా వేపు కొరకొరా చూశాడువాడు. "వీల్లేదు" అన్నాడు గట్టిగా.

"నా దగ్గర పన్నెండు మట్టిగోళీలున్నాయ్—హేయ్!" అన్నాను నోరూరిస్తూ.

"ఏవీ! చూపించు"

వెంటనే గొంతికిలా కూచొని ఒక్కొక్కటే లెక్క పెట్టూ వొళ్ళో వేసుకున్నాను. పది మట్టిగోళీలు, రెండు తారు వీను. చూస్తూంటే వాడికళ్ళు మెరిశాయ్.

"ఈ గోళీలన్నీ యిచ్చేస్తాను—మరినాకు ఆ రెండూ యిస్తావా?"

"పోరా వెధవా! — అంత తెలివితక్కువ దద్దమ్మ ననుకున్నావేమిటి?"

"ఇవికాక మరో ఎర్రగుర్రంముక్క కూడాయిస్తాను"- సిగరెట్టుపెట్టె చీట్లతో ఆటలా'డకోవటం మా సరదాల్లో ఒకటి.

"ఏదీ చూపించు"

జిగాలున మెరిసిపోయే ఎర్రగుర్రంముక్కని తీశాను. "మాకళ్యాణంగాడు అరవైముక్కలిస్తా నన్నాడు తెలుసా. నేనే వద్దన్నాను" అన్నాను మళ్ళీ.

కాని వాడు చలించలేదు. "ఇవ్వను పో" అన్నాడు.

వాడుయివ్వనన్న కొద్దీ నాకు వాటి మీదకే దృష్టి పోయింది. చూస్తూ నిలబడ్డాను మళ్లీ ఆట ఆరంభించాడు.

"ఒక్కసారి నేను గోలీ విసిరేదా!"

"గోలీని ముట్టుకో. చెయ్యి విరిచెయ్యకపోతే అప్పుడను"

నాకు వాడిని మింగెయ్యాలన్నంతకోపం వచ్చింది.

"నేను నిన్ను తన్నేయగలను తెలుసా?"—అన్నాను చేతులు పైకెత్తుతూ.

"ఏదీ తన్ను చూదాం?"

"నిముషంలో పడదోసేస్తాను"

"ఏదీ చెయ్యి"

"ఎందుకులే పిరికిజంతువివి నువ్వు"

"నువ్వే పిరికి జంతువివి"

"రెండుగోళీలుంటే డాబు చేద్దామనుకున్నావా?"

"నేనేం చెయ్యలేదు"

"నువ్వే చేస్తున్నావు"

"చెయ్యలేదు"

"చేస్తున్నావ్"

"లేదు"

"మా కిష్టిగాడితో చెప్పావంటే నిన్నెప్పుడూ యీ మైదానంలోకి రాకుండా చేసేయగలడు జాగ్రత్త"

"చెప్పయితే?"

"ఆ గోళీలు యివ్వకపోతే చెప్పేస్తాను"

వాడి రెండుకాళ్ళమధ్యా వున్నాయి గోళీలు. వాడి మొహంచూస్తూ చుట్టూతిప్పాను. ఇప్పుడు వాడివెనకన వున్నాయి గోళీలు.

"అడిగో కిష్టిగాడు!" అనరిచాను. వాడు అటువేపు చూశాడు అంతే. రెండు గోళీలూ పట్టుకుని వుడాయించాను.

రెండు ఫర్లాంగులవరకూ వెనక్కి తిరిగి చూడలేదు. సందుమలుపులో ఆగి చూసేసరికి వాడు అప్పుడే నా దగ్గరికి వచ్చేశాడు. దగ్గరున్న కాలువబొరియలో రెండు గోళీలనీ దాచేసి పక్కన ఉమ్మేశాను. ఉమ్మివేస్తే ఎవ్వరూ ముట్టుకోరని మా భగం చెప్పాడు. తర్వాత ధీమాగా వాడి కెదురుగ్గా నిలబడ్డాను.

వాడు ఎగవూపిరిలో పరిగెత్తుకొచ్చి నా చొక్కా పట్టుకున్నాడు

# రజనీకాంత్

"ఏవీ నా గోళీలు?"

"ఎవడిక్కావాలి వెధవ గోళీలు! రోడ్డుమీదికి విసిరే శా."

"ఎక్కడ విసిరావో తీసుకురా"

"నాకేం పట్టింది-మొదట చొక్కా వొదులు"

"గోళీలిచ్చేవరకూ వదలను"

"చివరిసారిగా చెపుతున్నానబ్బాయ్!-చొక్కా వదలక పోతే బుర్ర పగిలిపోతుంది"

"చూదాంలే ఆ తమాషా!"

"మూడంకెలు లెక్కపెడతాను. మూడు అనే సరికి వదలకపోతే చూడు ఏం చేస్తానో"

"సరే, కానియ్"

"ఒకటి"

వదల్లేదు వాడు.

"రెండు"

ఇంకా వదల్లేదు.

"ము...ము...మూడు" అంటూ వాడిమీద కలియబడ్డాను. ఇద్దరం కొట్టుకున్నాం. రక్కుకున్నాం. తిట్టుకున్నాం, నేలమీద దొర్లాం. చివరకి నా లాల్చీ వాడు చింపేశాడు. వాడి బనీను ముక్కలు ముక్కలు చేసేశాను నేను.

చివరికి నా పీకమీద కూర్చున్నాడు వాడు కూర్చుని అన్నాడు.

"'చిత్తు' అను"

"నేను అనను"

"అనకపోతే వదలను"

ముక్కులోంచి రక్తం కారుతోందినాకు. ముడుకు చిప్పలు గీసుకుపోయి రక్తం చిమ్ముతున్నాయి. ఏడుపువచ్చి ఏడ్చేశాను. వాడికి జాలివేసినట్టుంది. నన్ను వదిలేసి "పో" అన్నాడు.

చిరిగిన లాల్చీ సరిచేసికొని వాడివేపు కొరకొరా చూస్తూ యింటివేపు పరిగెత్తాను.

వెనకనుంచి అరిచాడు.

"నా గోళీలివ్వడం మరిచిపోకురా వెధవా! మళ్ళీ కన్పిస్తే తన్నెయ్యగలను!"

## 2

సాయంకాలం హుక్కా గొట్టంనింపుతూ మెల్లిగా తాతాజీతో అన్నాను-

"నువ్వు నాకిక అర్ధణా యివ్వక్కర్లేదు బాబాయ్- ఎప్పటికీను"

కూర్చున్నవాడల్లా యిదివినడంతోటే తుళ్ళిపడి యిటువేపు తిరిగి "నిజంగా!!"అన్నాడు.

"నిజం!...నీ తోడు"

ఇంకే ఒట్టువేసినా బాబాయి నమ్మడుగాని తనమీద

వేస్తే పూర్తిగానమ్ముతాడు.ఇదినేను చాలా రోజులక్రిందటే కనిపెట్టేశాను

ఇప్పుడీమాట వినగానే పొంగిపోతూ "రోజుకి అణా చొప్పున నెలకిరెండురూపాయలఖర్చుఎలాగురా భగవంతుడా అనుకున్నాను. నాకుతెల్సురా గోపూ! నువ్వు చాలా మంచి వాడివి!"అన్నాడు.

కాస్త హుషారుగా వున్నప్పుడెప్పుడూ యీ పొగడ్తలు నాకు దక్కుతూనే వుంటాయి. కాకపోతే యివాళ నల్లమందు కాస్త హెచ్చు మోతాదులో పడివుంటుంది. అందు చేత బాబాయి మాటలకి పొంగిపోకుండా "అదిసరే బాబాయ్—చిన్న సహాయంచేసి పెట్టాలినాకు"అన్నాను.

"ఏం చెయ్యాలో చెప్పు...నీ మాటకి తిరుగు చెప్పను" అన్నాడు.

"మరేంలేదు బాబాయ్—ఒకకురాణ్ని చితగ్గొట్టాలి" అన్నాను.

ఆశ్చర్యపోయేడు తాతాజీ. "అదేమిట్రా?"

"అదంతే బాబాయ్. నీకు తెలీదు. ఏం? చేస్తావా?"

ఆయనకేదో అనుమానం కలిగింది. నుదురు ముడతలు పడింది. నావేపు తిరిగి "అబ్బాయ్!—పొద్దున్న వేసుకొన్న లాగూ, చొక్కా యివేనా?" అన్నాడు నా బట్టలవేపు చూస్తూ.

తలమీద పిడుగు పడ్డట్టు గాభరాపడిపోయేను. "ఇవే బాబాయి" అన్నాను బితుకు బితుకు లాడుతూ.

"నాకళ్ళు కప్పలేవురా నువ్వు!—తీసుకురా ఆ బట్టలు ఎక్కడపెట్టావో!" అసరిచాడు.

నేను చేసేదిలేక లేచాను. అతనితో యిక వాదించి లాభంలేదని నాకుతెలుసు. నే నటుపోగానే నవ్వుకుని "ఏదో మకిలి పనిచేశాడు...అల్లరివెధవ!" అనుకోవడం విన్పించింది—

సగం చచ్చిన ప్రాణంతో ప్రొద్దుట గోళీలబ్బాయి చింపేసిన లాగూ, చొక్కా తీసుకొచ్చి అతనిముందు పడేశాను. వాటిని ఎత్తి పట్టుకుచూశాడు బాబాయి. చిరిగిపోయి, మట్టి పేరుకుపోయి, పీలికలయిన చొక్కా లాగూనీచూసి, జంతువునిచూసినట్టు చూశాడు నావేపు.

"ఈవూళ్ళో నిన్ను మించినవాడు ఎవడు వచ్చాడురా?" అన్నాడు కళ్లుపెద్దవిచేసి.

నేను తలవొంచుకున్నాను. అంతవరకూ అక్కడ నన్ను మించిన యోధుడు లేడన్న పేరువుంది.

"సరేపద. ఇంతగా నిన్ను కొట్టినవాడి పని పడ్తాను" అని ఒంటికాలిమీద లేచాడు.

"పదబాబాయ్" అన్నాను అతను చూడకుండా రెండు పొగాకుకాడలు లాగూలోకుక్కుకుంటూ.

గోలీలబ్బాయికోసం వెదుక్కుంటూ మైదానంవరకూ వచ్చాం. ప్రొద్దుటవున్న చోటే ఆడుతూ కన్పించాడు. నన్ను చూడగానే నవ్వి: "ఏరా పిరికీ! గోళీలు తెచ్చావా? ప్రొద్దుట గట్టిగా దెబ్బలు తగిలాయేమిటి?" అన్నాడు.

నేను జవాబు చెప్పేలోగానే బాబాయి తొందరగా వచ్చి వాడి బుజాలు విరిచి పట్టుకున్నాడు. చేసేదేమీలేక ఏడ్చాడు గోళీలబ్బాయి.

కాస్సేపయాక వాణ్ని వదిలేస్తూ "ఇక రారా యింటికి నేను లేకపోవడంచూసి మళ్ళీనాలుగు తగలనిస్తాడు" అన్నాడు బాబాయి నాతో.

"నేను వస్తానుబాబాయ్ — వెళ్ళు" అన్నాను.

ఏదో నన్ను తిడుతూ, గొణుక్కుంటూ వెళ్ళి పోయాడు.

వాడు ఏడుస్తూ రాతిచపటామీద కూచున్నాడు. నాకు వాణ్ని చూస్తుంటే జాలేసింది. వెళ్ళివాడి కెదురుగ్గా కూచొన్నాను.

"మరి నన్నెప్పుడూ కొట్టవుకద?" మెల్లిగా అడిగాను.

వాడు చురచురా నావేపు చూశాడు. కొట్టేసేవాడే. కాని మా బాబాయికి జడిసి ఛూరుకున్నాడు.

"పో గాడిదా! నాతో మాట్లాడకు." అన్నాడు.

పొద్దుట దెబ్బలాటలో వాడికీ దెబ్బలు తగిలాయి. మోచేతికి ఇంకా రక్తం కారుతోంది.

"మోచేయి చూడు—రక్తం ఎలా కారుతోందో!"

చూశాడు. నేలమీది మట్టితీసి రాళ్లు దులిపేసి మెత్తటి యిసిక గాయంమీద పోసుకున్నాడు. వాడి పనులన్నీ నాకు ఆశ్చర్యంగా కన్పించాయి...నావేపు చూడకుండా పక్కకి తిరిగి కూచొన్నాడు వాడు.

"ఊరుకో గోలీలబ్బాయి. ఏడవకు"

"గోలీలబ్బాయేమిటి? నాకు పేరుంది"

"ఏమిటది?"

"నేను చెప్పను"

"మనిద్దరం స్నేహితులుగా వుందామా?"

"ఉహుఁ"

"మరి నీ గోళీలు నీకిచ్చేస్తాను"

"ఉహుఁ"

"ఎర్రగుర్రం ముక్క యిస్తానుగా!"

"అయినా వద్దు"

"రెండు మట్టిగోళీ లిస్తాను"

"నీతో మాట్లాడ్డం నాకసహ్యం" అని చీదరించుకున్నాడు.

నాకుకోపం వచ్చేసింది. ఒక్కఊపున వాడి చొక్కా పట్టుకున్నాను.

"ఇదిగో గోళీలబ్బాయి! నాతో స్నేహం చేస్తావా లేదా?"

చటుక్కున చొక్కా వదిలించుకున్నాడు.

"నే చెయ్యను పోన్."

వెంటనే మైదానానికి అడ్డంగా పరిగెడుతూ అరిచాను: "అయితే మా బాబాయిని పిలుస్తానుండు. మళ్ళీకొట్టావని చెప్తాను" అని పరిగెత్తాడు.

"ఒరే అబద్ధాలకోరా! యిటుచూడు" అనరిచాడు వెనకనుంచి వాడు. కానినేను విన్పించుకోకుండా పరిగెత్తాను. రెండుమూడు వీధి మలుపులు తిరిగానో లేదో అడ్డుత్రోవన పరిగెత్తుకువచ్చి నన్ను మెడపట్టుకు ఆపాడు గోళీలబ్బాయి.

"ఒరే లుచ్ఛా! నే చెప్పేది విన్పించుకోరా"

"విన్పించుకోను - ముందు చెప్పు. నాతో స్నేహంగా ఉంటావా?" ముక్కుతూ మూలిగాడు 'ఊం' అని. నేను పొంగి పోయాను.

"నాతో రా" అన్నాను ముందుకినడుస్తూ.

"ఎక్కడికి?"

"చెప్తాగా"

ఇద్దరం నడిచాము. వాడిచెయ్యి పట్టుకు ప్రొద్దుట గోళీలు దాచినచోటికి తీసుకొచ్చాను.

"ఆకన్నంలో ఏమున్నాయో చూడు"

చూశాడువాడు- 'గోళీలు!' అనరిచాడు. చటుక్కున అందుకోబోయేడు.

"వాటిని ముట్టుకోకు. ప్రమాదం" అనరిచాను.

వాడు తుళ్ళిపడి వెనక్కు ఒకడుగువేశాడు. 'ఏం' అన్నాడు తెల్లబోతూ.

"ఆమాత్రం తెలీదూ,- దాచిన వస్తువు ఎదురుగుండా పోయి తీసుకుంటే పీడ చుట్టుకొంటుంది. వెనక్కితిరిగి కళ్ళుమూసుకుని యిలా ఎడమచేత్తో తియ్యాలి, అప్పుడు మన కేం బాధవుండదు" అంటూ వాటిని తీశాను. వాడు వికో ధంగాచూశాడు.

"ఇంద నీ గోళీలు"

"తే"అని తీసుకుని ఒక్కసారి గలగల లాడించి జేబులో వడేసుకున్నాడు. వాడికెందుకిచ్చేశానా అనిపించింది.

"నాకొకటి యివ్వవూ?"

"ఈసారి దెయ్యం బిలంలో దొరికినప్పుడు యిస్తాలే"

"దెయ్యం బిలం ఏమిటి?"

అటూ యిటూ చూశాడువాడు—'ఎవరితో చెప్పవు కదా!'

"ఊహుఁ?"

"మరినాకేవిస్తావ్?"

ఏమిటివ్వాలో తెలీక అటూయిటూచూశాను. వెంటనే జేబులోకి చెయ్యిపోనిచ్చి అగ్గిపెట్టె తీశాను.

"ఇదిగో, దారంకట్టి వుంచాను. చచ్చిన తూరీగ. భలేరంగుల్లోవుందిలే. యిదిస్తాను"

"అచ్చంగా?!"

"ఓ"

బ్రహ్మానంద పడిపోయాడు.

"అయితే నీకింకా చాలా చూపెట్తాను"

"ఎక్కడున్నా యవి?"

"ఇప్పుడుచెప్పను. ఇలా రోడ్డుమీద చెప్పకూడదు. గాలివీచనిచోట చెప్తే రహస్యం బయట పడదు"

"అయితే నువ్వు చూపించే చోట గాలిఉండదేమిటి?"

"ఉన్నా యిలావీచదు. చూస్తావుగా?"

"ఎప్పుడు వెళ్దాం"

"నేతర్వాత చెప్తాలే"

వాడితో స్నేహం నాకు ఛాలా సరదా ఇచ్చింది. అగ్గిపెట్టె నల్ల లాగూలో దోపుకున్నాడు.

"ఉండు. రెండు మట్టిగోళీలుకూడా ఇస్తాను" అని తీసి యిచ్చాను. అవీ జేబులో పడేసుకున్నాడు,

"పొద్దుట బాబాయిచ్చిన అర్ధణావుంది. ఏమైనా కొనుక్కుందామా?"

"ఏమిటి కొందాం?"

"నువ్వే చెప్పు"

"తుమ్మబంక కొందామా?"

"ఛ! అదెందుకూ!"

"తింటే ఎంత బావుంటుందో తెలుసా!...నువ్వెప్పుడన్నా తిన్నావా?"

"లేదు"

"మరయితే నేను రుచిచూపిస్తాను. నాన పెట్టితినాలి"

నాకునచ్చలేదు యీ పద్ధతి.

"మరేదయినా చెప్పు"

"గాలిపడగ కొను"

"భలేబాగుంది నీ ఆలోచన!పద"

"ఆగు, మరి దారపు వుండ!"

"దానికేం? మా బాబాయి కుట్టుడుదారం వుందిగా? అది తెచ్చేస్తాను."

"సరే...పద"

ఇద్దరం బజారుకి వెళ్ళిగాలిపడగ కొన్నాం.

"దీన్నెప్పుడుఎగర వేద్దాం!"

"రాత్రి సరిగ్గా పదకొండు గంటలకి"

నేను భయపడ్డాను. "అర్ధరాత్రప్పుడా?"

"ఏం? భయమా? వెన్నెల వుంటుందిగా?"

"ఉంటుందిలే. కాని భయం వేయదూ?-దెయ్యాలూ అవీ ఉంటాయని మాకిష్టిగాడు చెప్పాడు"

"ఏడిశాడు. మొగాళ్ళకి మనకి భయం ఎందుకురా? నాతో రా. మూడురోజుల్లో అవన్నీ ఎగరగొట్టేస్తాను"

నా కళ్ళకి వాడో పెద్ద వీరుడిలాగ కన్పించాడు.

"అయితే అంతవరకూ దీన్నెక్కడ దాచాలి?"

"నా దగ్గర ఉంచుతానులే. మా బామ్మకి ఒక కన్ను కన్పించదు. రెండో కన్నుకి చత్వారం"

"సరే, మీ యిల్లుచూసి వస్తాను పద"

ఇద్దరం ఎన్నో కబుర్లు చెప్పుకుంటూ నడిచాము. సముద్రంపక్కన గుడిసెదగ్గరికి తీసుకువచ్చి "ఇదేమాయిల్లు" అన్నాడు.

"మీరు బీదవాళ్ళన్నమాట!"

"ఊఁ"

"అయితే మరెప్పుడూ నీ చొక్కా చింపనులే" అన్నాను.

"సరే రాత్రి కలుద్దాం. సరిగ్గా పదిన్నరగంటలకి మీ యింటి కిటికీదగ్గర పిల్లి అరుపు అరుస్తాను. నువ్వు రెడీగా వుండు. పారిపోదాం" అన్నాడు.

"సరే" అన్నాను. వాడు లోనికి వెళ్ళిపోయేటప్పుడు పిలిచాడు.

"నీపేరేమిటన్నావ్?"

"రాత్రి చెప్తాలే. అందాకా 'రజీ' అని పిలువు.

నేను యింటివేపు నడిచాను. అప్పటికే బాగా చీకటి పడిపోయింది. ఇవాళ ఎవరో గొప్పవాణ్ణి కలుసుకున్నట్టు పొంగిపోయేను. 'రజీ' విషయంచెప్తే మావాళ్ళంతా 'గుమ్' అయిపోతారు—అనుకొంటూ నడిచాను. ఇంటిదగ్గరికి వచ్చాక జేబులోంచి పొడవుపాటి గుడ్డతీసి కాలిబొటన వ్రేలికి చుట్టుకున్నాను. కాలు బెకుకుతూ యింట్లోకివచ్చాను.

"ఏరా-యింత ఆలస్యంగా వచ్చావ్?" అని ఉరిమాడు బాబాయ్.

"కాలు రాయికి తగిలి పడిపోయాను బాబాయ్!—సాయిబుచేతకట్టు కట్టించుకు వచ్చేసరికి ఆలశ్యమయిపోయింది" అంటూ ఇంట్లోకి దూరిపోయేను.

# 3

భోజనంచేసి పక్కమీద పడుకున్నానన్న మాటేగాని నా దృష్టంతా 'రజీ'మీదే వుంది. వీధిగుమ్మంలో హుక్కా పీలుస్తూ చుట్టుపక్కలవాళ్ళు నలుగురైదుగురితో పిచ్చాపాటీ ప్రారంభించాడు బాబాయి. చీమ చిటుక్కుమన్నా తుళ్లిపడుతున్నాను నేను.

ఈ లోగా ఎప్పుడు నిద్రపట్టిందో యేమో చర్చిగంట పదకొండు కొట్టేసరికి వీపు చరిచినట్టు తెలివి వచ్చింది. బాబాయి పక్కనే గుర్రుతీసి నిద్రపోతున్నాడు. 'రజీ' వచ్చి వెళ్ళిపోయాడా అని భయపడ్డాను. ఇంతలో పిల్లి అరుపు

విన్పించేసరికి ఉష్వాంగిపోయాను. బయల్దేరే మార్గాలు చూశాను. గుమ్మానికి అడ్డంగా మంచం వేసుకు పడుకున్నాడు బాబాయి. మంచంకిందనుంచిదూరిపోవడానికి లేచాను. ఇంతలో పిల్లి అరుపు హెచ్చయింది.

"అర్ధరాత్రయినా యీ పిల్లులు నిద్ర పాడుచేస్తున్నాయిరా" అని అటునుంచి ఇటు తిరిగాడు బాబాయి విసుక్కుంటూ.

"ఈసారి పిల్లి అరుపు గట్టిగా విన్పించిందికిటికీపక్కగా. బాబాయి లేస్తాడేమోనని భయపడ్డాను.

'ఇష్!' అని తలుపు చప్పుడు చేశాడు బాబాయి.

తుళ్ళిపడ్డాను. కాస్సేపు మంచంమీదే కూర్చుండిపోయేను. రజీ అరవడం మానలేదు. రెండు పిల్లులు దెబ్బలాడుకొంటున్నట్టు కిర్ కిర్ మని చుట్టుకు పోతూ అరుస్తున్నాడు. మధ్యలో మామూలుగా అరుస్తున్నాడు. ఇలా రకరకాలుగా మొదలెట్టాడు.

'ఇదెక్కడిపిల్లిరా! దీని దుంప తెగ!' అని లేచి-కూచున్నాడు బాబాయి.

పిల్లి అరుపు వినగానే రోడ్డుమీది రెండుమూడు కుక్కలు మా కిటికీ వేపుకి వచ్చేశాయి. అరుపు లంకించుకున్నాయి. 'చచ్చానురా భగవంతుడా! అనుకున్నాను. రజీ అంతటితో పిల్లి అరుపుమాని కుక్క అరుపు లంకించుకున్నాడు. అడివికుక్కలా మొరసారించి భోరున రాగాలు తీస్తున్నాడు. రోడ్డంతా గందరగోళమయిపోతోంది. కాని ఆగలేదువాడు

ఆ అరుపులకి భయపడి ఎక్కడికక్కడ అక్కడ తోకముడు చుకు పారిపోయేయి. మళ్ళీ పిల్లి అరుపులు ప్రారంభించాడు రజీ.

ఇక నిద్దరపాడవడంతో చిర్రెత్తిపోయి కర్రతీసుకు లేచాడు బాబాయి. నేను భయపడిపోయేను ఏం చేస్తాడో నని. తలుపుతీసి బయటికి వచ్చాడు. నేను వెనకనే నడిచాను- అరుపు ఆపమని రజీకి సంజ్ఞ చేద్దామనుకున్నాను. కానిసాధ్యం కాలేదు. పిల్లిఅరుపు ఆగలేదు.

మెల్లిగా తలుపు తీసి కర్రతిప్పి విసిరాడు బాబాయి. 'ఈదెబ్బతో పిల్లి చస్తుందిలే!'అన్నాడు.

అంతరాత్రిలోనూ 'కుంయ్యో' అన్న అరుపు విన్పిం చింది.

'ఎంత పనిచేశావ్ బాబాయి'అన్నాను రజీకిదెబ్బతగిలిం దనే బాధతో.

'పిల్లి కుంయ్యో అంటుందిరా?' అన్నాడు నిద్ర మత్తుతో.

'కుంయ్యో అనలేదులే. గిన్నెక్రింద పడిన చప్పుడది' అన్నాను.

'సరేలే. లోపలికి పద'

ఇద్దరం లోపలికి వచ్చాం.

మళ్ళీ పిల్లి అరుపు విన్పిస్తుందేమోనని చెవులు రిక్కిం చుకు విన్నాను. మరి విన్పించలేదు!

మర్నాడు లేచేసరికి చాలా పొద్దెక్కింది. రాత్రి

చాలా వరకూ మేలుకోవడంవల్ల బద్ధకంగా వుంది. బడికివెళ్లా లనిపించలేను. కాని రజీ విషయం స్కూల్లో అందరికీ చెప్పాలి. వాళ్ళంతా నిన్న రాజూ పరివారం ఆట ఆడేరో లేదో కనుక్కోవాలి...అనుకొన్నాను, అనుకొని లేచాను. గంటముందుగానే బడికి వచ్చేశాను.

దూరంగా నన్ను చూస్తూనే కిష్టుడూ, రాజిగాడు. మురళీ,కళ్యాణంఅంతా చుట్టుముట్టారు. 'ఏరా ఆటదొంగా?- నిన్న ఎగ్గొట్టావ్?'

నేను వీకుడిలాగ పోజుపెట్టి "నిన్న తొందరపనిమీద వెళ్ళాల్సివచ్చిందిలే!-అంచేత రావడానికి తీరిక లేకపోయింది" అన్నాను.

"రాజువేషం వెయ్యడానికే తీరికలేకపోయిందిరా!" అన్నాడు మా అందర్లోకీ చిన్నవాడు-కన్న.

"ఎవడికావాలోయ్ రాజువేషం?...అంతకన్న గొప్ప మనిషినిచూశాను తెల్సా?"

అందరి మొఖాలు తెల్లబడ్డాయి.

"ఎవ్వడావాడు!" అంటూ అందరూ చుట్టూ కూచొన్నారు-

అక్కణ్ణుంచి ఉన్నవీ లేనివీ కలిపి కోతలు ప్రారంభించాను.

"నిన్న పొద్దుట ఆటకివస్తూంటే అతను కలిశాడురా. నాతో స్నేహం చేస్తావా అని అడిగాడు. నేను మొదటొప్పు

కోలేదు- నాకు రెండు గాజుగోళీలిస్తానన్నాడు, నెమిలికన్ను ఇస్తానన్నాడు, వద్దన్నాను”

“నేనయితే పుచ్చుకునే వాణ్ని. నెమిలిపించం ఎలా వుందిరా?” అన్నాడు రాజిగాడు మురిసిపోతూ.

“అచ్చు కృష్ణుడి తలలో నెమిలిపించంలా అంతంత కన్నుల్తో వుందిరా. అయినా వద్దని కసిరేశానా? ఇంకా స్నేహం చెయ్యమని బ్రతిమాలాడు. చివరికి ఒప్పుకున్నాను. ఒప్పుకోగానే పొంగిపోయి—ఒక వస్తువులోపల వుంచితే రెండింతలు, మూడింతలూచేసే రహస్యబిలం, డబ్బు దాచుకునే గుహాలూ, ఎక్కడా గాలివెయ్యని చోటులూ చూపిస్తానన్నాడు”

“అబ్బా!”

“మరేమిటనుకున్నావ్?— మళ్ళీ చూడడానికి చిన్నవాడిలా కన్పిస్తాడు. మెదడునిండా తెలివే!—రాత్రివేళ తిరగడమంటే అతనికి భయంలేదట. దెయ్యాలంటే అతనికి నిర్లక్ష్యంట. వాటితో అప్పుడప్పుడు మాట్లాడుతుంటాట్ట రెండు కామినీభూతాల్ని అతనుపట్టి బంధించాడుట. అవి తనకి కొన్ని మంత్రాలుకూడా నేర్పేయన్నాడు. అతని పేరేమిటో తెలుస్తా?—...ఏమిటి చెప్మా!—మరిచిపోయేను...ఆఁ!- అదీ—రజీ! అతని పేరు! ఎలావుంది!—బాగులేదూ?”

అందరి మొహాలూ తెల్లబడిపోయేయి-నామాటలు విన్న కొద్దీ వణికిపోయేరు. ‘మాంత్రికుడు కాబోలురా!’ అన్నాడు మురళి వణుకుతూ.

"పేరుకూడా అలాగేవుంది" అన్నాడు కళ్యాణం.

"మనల్నందర్నీ స్నేహం చేసుకుంటానన్నాడు. ఆ గుహానీ, రహస్యపు బిలాన్నీ చూపుతాడట!" అన్నాను.

"బాబోయ్! నేం అక్కడికి చస్తేరాము. అతనితో స్నేహం చస్తేచెయ్యం" అన్నారు అంతా ఏకగ్రీవంగా.

నా మనస్సు కలుక్కుమంది. మరి ఎక్కువ కోతలు కోసెయ్యడం వల్ల యీనష్టమంతా వచ్చిందనిపించింది. అంచేత వెంటనే నవ్వేస్తూ "ఒరి దద్దమ్మల్లారా!–మిమ్మల్ని భయపెట్టడానికి అన్నానంతే—దెయ్యంమాట వుత్త అబద్ధం"

అంతా నాముఖంలోకి చూసేరు ఆశ్చర్యంతో.

"నిజం!"

"కావలిస్తే చూడండి. పలకనితొక్కి ప్రమాణం చేస్తాను. సరస్వతి సాక్షిగా"—అలాగే చేశాను.

అప్పటికి కాస్త నమ్మకం చిక్కింది వాళ్ళకి.

'ఒరే ఆగండిరా. తులసిచెట్టుమీద ఉమ్మి వేస్తావా?' అనడిగాడు కళ్యాణం.

నాకుకాస్త భయంవేసింది. ఇది చెయ్యటానికి—కాని దెయ్యాల విషయం నిజంగా అబద్ధమేగా! అంచేత ఒప్పుకున్నాను. ఊరిచివర తులసిచెట్టు దగ్గరికివచ్చాం. నేను కళ్ళు మూసుకుని "నేను చెప్పింది అబద్ధమయితే నాతల వెయ్యి చెక్కలయిపోవుగాక!" అని ఉమ్మి వేశాను. నిజంగా ఏమీ కాలేదు.

"సరే. నమ్మేశాంరా" అన్నారు అంతా.

"సాయంకాలం అతణ్ని మీకుచూపిస్తాను" అన్నాను.

బడివిడిచిపెట్టగా నే పలకా పుస్తకాలూ యింట్లో పారేసి అంతా మైదానంమీాదకి వచ్చేశాం. చుట్టూ చూశాను నేను. కానిఎక్కడా రజీ కన్పించలేదు. చీకటిపడేవరకూ కూర్చున్నా కన్పించలేదు. నాకు భలే విచారమేసింది.

ఇంతలో మా కిష్టుడు లేచి అందరితో గట్టిగాఅన్నాడు.

"ఒకేయ్! ఎవడో మాంత్రికుడు గోపుని మోసం చేశాడు. పదండి యింటికిపోదాం. ఇకవాడు వచ్చేదేవిఁటి?" అన్నాడు. తర్వాత పిరాధి పీరుడులాగా నా వేపుచూస్తూ "ఆ మాంత్రికుడిన్నేహం-వదిలేవరకూ నిన్ను మాగ్యాంగులో తిరగనివ్వం!" అన్నాడు.

అంతా ఒప్పుకున్నారు. నన్నక్కడే వదిలేసి అంతా వెళ్ళిపోయేరు.

నేను మరి కాస్సేపు అక్కడే కూర్చొని ఎంతకీ రజీ రాకపోయేసరికి ఏడుపుమొహంతో యింటికి వచ్చేశాను.

# 4

ఈ రోజంతా నామనసు మనసులో లేదు.పడుకొన్నా నిద్దర రాలేదు. రజీగురించే ఆలోచిస్తున్నాను.

"దెయ్యాలున్నాయని నీకునమ్మకముందా బాబాయ్!" అన్నాను.

"ఏం!"

"అబ్బే! ఏమీాలేదు"

"దెయ్యాలేం చేస్తాయోయ్ వెధవదెయ్యాలు. ఓసారి అలాగే నేను మిలటరీనుంచి వస్తున్నాను యింటికి. ఇల్లువిడిచి పోయి ఎన్నాళ్ళో అయిందేమో మాంఛి ఆతృతగా వుందిలే మీపిన్నిని చూడాలని. అయితే అర్ధరాత్రిలో నడిచిరావడం యింకోడయితే చెయ్యలేకపోయేవాడే. కాని నేను ధైర్యం చేశాను. అడివి అంతా చీకటిగావుంది. అంతరాత్రిలో అడివిలో వెలుగుకన్పిస్తే ఆశ్చర్యంవెయ్యదూ? నేను భయపడిపోయేను. అలాగే వణికిపోతూ వెలుగుచూస్తూ నిలబడ్డాను. ఒరే గోపూ, నువ్వు చెప్తేనమ్మవు. ఆ వెలుగు మెల్లిమెల్లిగా నడిచిందిరా. మెల్లిగావచ్చివచ్చి నా పక్కనుంచి వెళ్ళింది. ఏదో పెద్దగాలి నా వేపుకి వీచినట్టయింది. వళ్ళునీరయిపోయింది. శరీరం బిగుసుకుపోయింది. ఓ గుడ్లగూబ కేరుమని అరిచింది. నక్క మొర్రో అంది. గాలి 'రంయ్యి'మనివీచింది. నా కాలికింద ఎండుపుల్ల పుటుక్కుమంది. గుండెకొట్టుకోవడం విన్పించింది. చెట్టుకొమ్మ బుజానికిరాసుకుంది. కాలు వణికింది. చూస్తున్న కొద్దీ కళ్ళు బైర్లు కమ్మాయి. ఆ వెలుగు పెద్ద మోతతో నాచుట్టూ తిరగడం ప్రారంభించింది. కీచురాళ్ళు ఒకటే అరుస్తున్నాయి. ముఖం తిరిగి నేలమీద పడిపోయేను" అనిలేచి చుట్ట వెలిగించాడు బాబాయి.

అదంతా వింటూనే మంచంమీదపిడచకట్టుకుపోయేను నేను. మనిషంతా వణికిపోతున్నాను. ముచ్చెమటలూ పోశాయి. గొంతు తడి ఆరిపోయింది. నోరువెళ్ళబెట్టి మోకాకులమీద తల ఆనించి దగ్గరగా ముడుచుకు కూచున్నాను.

"మెలకువ వచ్చిందిరా అబ్బాయ్! కళ్ళు విప్పేసరికి ఆ వెలుగు నేలమీద పరుచుకున్నట్టు కనిపించింది. ఇంతసేపూ దెయ్యంనన్నే మీా చెయ్యలేదేమా అనిపించించింది. అయినా ఎదట నేనుండగా అలాపడుకుంటుందా దెయ్యం? వెంటనే అనుమానం కలిగింది. దగ్గరికి వెళ్ళిచూశాను. చూస్తే ఏం కన్పించిందనుకున్నావ్?"

"ఏమిటి?"—ఆగిఆగి అడిగాను.

"తీరాచూస్తే మిణుగురు పురుగుల గుంపురా అది" అని యిల్లంతా ప్రతి ధ్వనించేట్టు నవ్వేడు. నేను తుళ్ళి పడ్డాను ఆనవ్వుకి—నాకూ నవ్వొచ్చింది, కథ వింటూంటే.

"అప్పట్నుంచీ దెయ్యాలంటే భయం లేదు. ఇకమీాదట చచ్చినా భయపడను" అన్నాడు నవ్వుతూనే.

ఇంతలో కిటికీదగ్గర పిల్లిఅరుపు విన్పించింది. నాకుఎక్కడ లేని ధైర్యమూ వచ్చేసింది.

"మళ్ళీ వచ్చిందిరా వెధవపిల్లి!" అని లేవబోయేడు.

"నువ్వూరుకో బాబాయి. నేను తరిమేస్తాను" అన్నాను.

"నువ్వుండరా. మరెప్పుడూ యిటువేపురాకుండా దానిపని పట్టేసాను" అని కర్రతీసుకులేచాడు. నేను యీసారి మరీ భయపడిపోయేను. అసలు రహస్యం చెప్పేద్దామను కున్నాను. కాని నోరాడలేదు.

దీపం పట్టుకుని తలుపు తెరుచుకు బయటపడ్డాడో లేదో "అమ్మో" అని కేకేసి దభీమని నేలమీాద పడిపోయేడు.

నాకు నవనాడులూ క్రుంగిపోయేయి. ఈసారి నిజంగా

పిల్లి వచ్చిందేమోననుకున్నాను. తీరాచూస్తే బాబాయి చేతిలో లైటుకూడా ఆరిపోయింది.

"ఏమిటి బాబాయి? "అన్నాను.

"ఏదో అడివి మృగంలా వుందిరా, మొహంమీద కొట్టి పారిపోయింది" అన్నాడు ఏడుపు స్వరంతో.

రజీ కొట్టి పారిపోయాడేమో? కాని అడవి మృగంలా కొట్టి పారిపోగలడా?—

"గట్టిగా దెబ్బతగిలిందేమిటి బాబాయ్."

"గట్టిగా అంటావేమిటిరా నుదురు విడిపోతేనూ?—కావలిస్తేచూడు" అని నుదురు చూపాడు.

చీకట్లో చేత్తో తడిమాను. తడిగా చిక్కటిద్రవం తగిలింది.

"రక్తం కారుతోంది."

"ఏదీ, దీపం వెలిగించు"అని బాడ్లో అగ్గిపెట్టె తీసి యిచ్చాడు. నేను వెలిగించాను. నిజంగానే అతనినుదుటి మీద చర్మం పిగిలి గాయమయింది.

"ఏదో గట్టివస్తువు తగిలిందిరా" అన్నాడు.

చుట్టూ వెదికాను.దూరంగా గుమ్మందగ్గిరచిన్నజామ కాయ కన్పించింది దాన్ని చేత్తో అటూయిటూచూసి తలెత్తాడు బాబాయి. ఎదురుగ్గా చీకట్లో ఊగుతోంది జామ చెట్టు-దానిమొదట్లో ఏదోనీడ లీలగా కన్పిస్తోంది గుడ్డి వెలుగులో.

"అదిగో మృగం!"అన్నాడు బాబాయి.

నా పైప్రాణాలు పైకిపోయాయి. అటువేపు చూశాను. ఏదో అక్కడవుంది.

"నేనిక్కడేవుంటాను. నువ్వెళ్ళి చుట్టుపక్కల వాళ్ళనిద్దర్ని పిలుచుకురా" అన్నాడుకూర్చున్నచోటు నుంచి లేవకుండానే. అతనికాలు కూడా బెణికినట్టుంది

నేనా మృగంవేపు చూస్తూనే బితుకు బితుకులాడుతూ అందరికీ చెప్పేశాను. అక్కడితో కర్రలూ, గునపాలూ పట్టుకుని మందలా వచ్చేశారు అంతాను.

బాబాయి యింకా మూలుగుతూనేవున్నాడు. నన్ను చూడగానే "ఒరేవ్! దీపంకూడా ఆర్పేసిందిరా మృగం— అదిగో జామకాయ!" అన్నాడు ఏడుస్తూ. అతనికీ ధైర్యం పోయింది.

"బహుశా దెయ్యమయి వుంటుంది బాబాయి"

అతనికి మరిక ప్రాణంలేదు. వణకి పోతున్నాడు అంతలో ఆదెయ్యం జామచెట్టెక్కిపోయింది. అందరూ పోగయారు. కాని ఎవరికీ ముందుకెళ్ళడానికి ధైర్యం చిక్కలేదు. చివరికి అందరూ కూడ బలుక్కుని కొరివి వెలిగించారు. అంతా ఆయుధాల్ని పట్టుకుని మెల్లగా ముందుకు నడిచారు. నేను అక్కడే నిలబడి చూస్తున్నాను ఏం జరుగుతుందా అని. జామ చెట్టుకి రెండడుగుల దూరంలోకి రాగానే, చెట్టుమీంచి వికృతమయిన ఓ అరుపు విన్పించడంతో అందరూ కెవ్వున కేకవేసి కూలకూలబడిపోయేరు. కళ్ళుమూసుకుని క్షణకాలం ఉండిపోయారు. నేనూ స్తంభాన్ని కావలించుకుని గట్టిగా కళ్ళుమూసుకున్నాను.

ఇంతలో ఎవరో నన్ను చెయ్యిపట్టుకుని లాక్కుపోతున్నారు. గట్టిగా కేక వెయ్యాలనుకున్నాను, కాని సాధ్యం కాలేదు. కళ్ళుకూడావిప్పి తిన్నగా చూడలేను. పరిగెత్తాను ప్రారిచివరివరకూ. అక్కడ ఆగాను. మెల్లిగా ఊపిరి పీల్చుకుని ఎదుటనున్న మనిషిని కళ్లువిప్పి చూసేను.

చూస్తూనే అరిచాను.

"నువ్వా రజీ"

## 5

"అవును. నేనే!" అన్నాడువాడు నవ్వుతూ.

"అక్కడికెలా వచ్చావ్? దెయ్యంఏమిటి!"

"దెయ్యంలేదూ, ఏదీలేదు. నేనే గమ్మత్తు చేశాను"- పీకుడిలా అన్నాడు చెమటపట్టిన నుదురుని చొక్కాతో తుడుచుకొంటూ.

"ఇదంతా ఏమిటి?-మొదట్నుంచీ చెప్పు?"

ఇద్దరం అలసిపోయివున్నాం. గుక్కతిరగడం లేదు. అలారాయిమీద కూర్చున్నాం. ఆరంభించాడు: "మొదటయిది చెప్పు—నిన్నకుక్క అరుపు ఎలా అరిచాను?"

"చాలా బావుంది"

"నేనూ అదేఅనుకున్నానులే!—అదే మొదటి అరవడం. భలే బాగా వచ్చింది. అప్పుడే యిద్దరు ముగ్గురుకి కుక్కఅరుపు నేర్పేశాను" — అని చెప్పాడు ఆనందంగా. తర్వాత బింకంగా నావేపు తిరిగి "పిల్లిఅరుపు అంతసేపు అరిచినా బయటికి రావేం?—ఇంటిపిల్లిఅరుపు, గండుపిల్లిఅరుపు,

అడవిపిల్లి అరుపు, పిల్లి ఏడుపు; రెండుపిల్లుల దెబ్బలాట—యిన్ని అరిచినా వచ్చారుకాదు. చివరికి నాకు విసుగేసింది" అన్నాడు.

"అన్ని అరుపులు నీకెవరు నేర్పారు" అన్నాను ఆశ్చర్య పోతూ...

"ఒక సాధువు నేర్పాడులే. రెండు గోనెలు, కుట్టుకునే సూదులూ, పాత చెప్పులజత, కొబ్బరిచిప్పలూ యిచ్చి నేర్చుకున్నాను. నీకూ నేర్పేదా?" అన్నాడు వుత్సాహంగా.

వాణ్ని చూస్తూంటే ఆశ్చర్యం వేసింది నాకు. "అలాగే నేర్పుదువుగానిలే. మరినిన్న బాబాయివిసిరిన కర్రనీకు తగ లేదూ?"

"ఎందుకు తగలేదు? కాలికి తగిలింది. అప్పుడు ప్రాణం పోయినట్టనిపించిందిలే. ఇప్పుడు బాగానేవుంది. మట్టీ, సున్నం కలిపికట్టేశాను—సముద్రం నీళ్ళలో యీతకొట్టినతర్వాత. అలాచేస్తే ఎలాంటి దెబ్బయినా పోతుందని నాకొకడు చెప్పాడు. ఇదిగో చూడు" అని కాలికి కట్టుకున్నకట్టు చూపించాడు.

"సరే. ఇంక నావస్తువుల్ని చూపిస్తావా?"

"పద" అని లేచాడు రజీ.

అప్పటికి పన్నెండయింది సరిగ్గా.

"నీ పూర్తి పేరేమిటి?"—దారిలో అడిగాను.

"పూర్తిపేరు అదేదో ఉందిలే-రజనీకాంత్ అని. ఛస్. వెధవపేరు. అలాంటిపేర్లు హిందీమాష్టర్లకే వుంటాయిట మా పెదనాన్న అనేవాడు. నాకు హిందీ మాష్టరవడం యిష్టంలేదు. మాష్టరుగావుంటే పిల్లలంతా ఏడిపిస్తారు.

అంచేత నాకు రజనీకాంత్ అనిపిలిపించుకోవడం యిష్టంలేదు"

"మరి?"

"రజని అంటేచాలు. నన్ను బాగా తెల్సినవాళ్ళంతా 'రజీ' అంటారు. నువ్వాలాపిలు. మరి నీపేరు?"

చెప్పాను.

"నువ్వేమిటి చదువుకున్నావ్?" అనడిగాను మళ్ళీ.

"చదువు మానేశాను" అన్నాను నిర్లక్ష్యంగా.

నేను ఆశ్చర్యపోయాను. "అదేం!"

"ఏమీలేదు. నాకిష్టంలేదు. ఓసారి మాష్టరు నన్ను కొట్టాడు-నేనతన్ని కొట్టాను. పెద్ద తగువయింది. నన్ను బడిలోంచి తీసేస్తామని బెదిరించారు. నేనే బడికి వెళ్ళడం మానేశాను అప్పట్నుంచీను"-నవ్వేడు.

"మరి మీ బామ్మ ఊరుకుందా?"

"మొదట్లో తిట్టింది. తర్వాత కొట్టింది. కొన్నాళ్ళు నేను బడికి వెళ్తున్నాననే అనుకొంది. తర్వాత నిజం తెల్సాక కూడా ఏమీ అనలేదు. నేనంటే బామ్మకి భలేయిష్టంలే!"

నేనునిర్ఘాంతపోయేను."మరిరోజంతానీ కెలాగడుస్తుంది?"

"సాయిబుకొట్లో టోపీలు కుడతాను కొంతసేపు. రోజుకో బేడ యిస్తాడు. తర్వాత యిప్పుడు మనం వెళ్తున్న చోటుకి వచ్చేస్తాను. ఇక రోజంతా అక్కడే. రాత్రి భోజనం చేశాక మళ్ళీ యిక్కడికే వచ్చేస్తాను. సరదాగా గడుస్తుం దిలే!"అన్నాడు.

నాకు ఉత్సాహం కలిగింది వింటూంటే. "నాకూబడి లేకపోతే ఎంతబావుణ్ను!"అనుకున్నాను.

"నీకు చుట్టలుకాల్చే అలవాటుందా?" అన్నాడురజీ, జేబులోంచి చుట్టలుతీస్తూ.

'ఓ' అన్నాను, అదొక్కపనీ అతనితోపాటు నేనూ చెయ్యగల్గుతున్నందుకు సంతోషిస్తూ.

జేబులోంచి పొగాకుతీసి వాడికి చూపాను. దాన్ని చేతిలోకి తీసుకు చూశాడు. కొరికాడు. వాసనచూశాడు. తర్వాత ఉమ్మేశాడు.

"తూ!... యిదేం పొగాకు? నీమొహంలావుంది. యీచుట్టల్ని చూడు. ఎంతమంచి పొగాకు చుట్టానో?"

చుట్ట కాల్చాను. మంచిబాగా వుంది.

"బావుంది" అతనిలాడించాను.

ఇంతలో రజీ దూరంగా చెయ్యి చూపిస్తూఅరిచాడు:

"అదిగో మనం వెళ్ళాల్సినస్థలం వచ్చేసింది!"

# 6

తలెత్తి చూశాను.

డాల్ఫిన్స్‌నోస్ పర్వతం చీకటిలో రాక్షసుడిలాగ కన్పించింది. ప్రక్కన మరో కొండ. వాటివెనక అలాంటివి మరిమూడు కొండలుంటాయి. అది దాటితే 'ఏరాడ' అనే పల్లెటూరు. ఇదంతా నాకిదివరకే తెల్సు. ఓసారి మా బాబాయితో వెళ్ళాను. ఎదురుగ్గా కన్పించే రెండు కొండల మధ్య లోయఉంది. అక్కడ ఎప్పటిదో తోట, పెద్ద చెట్లూ

వున్నాయి. దాన్ని 'లోయతోట' అంటారు. అక్కడికి వెళ్ళాలంటే బోటుమీద వెళ్ళాలి. ఆ కొండలముందునుంచి హార్బరులోకి స్టీమర్లు యీ వాయగుండానే రావాలి. నాలుగయిదు నిలువుల లోతు వుంటుంది. కిష్టిగాడూ, నేనూ మధ్యాహ్నం వేళల్లో స్కూలు ఎగేసి యిక్కడ యీతలు కొడ్తూండేవాళ్ళం. ఇవతలి ఒడ్డునుంచి అవతలి వేపుకి సరిగ్గా రెండు ఫర్లాంగులుంటుంది. ఓ సారి మా కళ్యాణం పందెం వేసి యిరవై నిముషాల్లో యీదు కొచ్చేశాడు.

ఇప్పుడు యీ బోటుదగ్గరికి వచ్చాం యిద్దరమూను.

"ఇదేమిటి? యిక్కడికెందుకూ?" అన్నాను.

"చెప్తాను, మొదట బోటు ఎక్కు" అన్నాడు చుట్ట వెలిగిస్తూ.

"తాతా!" అనరిచాడు రెండుమూడుసార్లు. ఎవ్వరూ పలకలేదు. కొండలదగ్గర్నుంచి ప్రతిధ్వనిమాత్రం వచ్చింది.

"నువ్వు తెడ్డుపట్టగలవా?" అనడిగాడు.

మెల్లిగా 'ఊఁ' అన్నాను. నిజానికి ఎప్పుడూ అల వాటులేదు.

"ఇంత రాత్రిలో ఒంటరిగా ఆ తోటలోకి ఎందుకూ? మంచిదిగాదు" అన్నాను.

"ఓరి పిరికిపందా! అంతేనా నీ ధైర్యం!"

"సరే పద" అని బోటులో ఎక్కాను. తాడు తప్పించి బోటులోకి గెంతేశాడు రజీ. తనూ తెడ్డువేశాడు.

నీటిమధ్య కొచ్చేశాం మేము. వెన్నెలచల్లగా ఉంది.

నీరు మెరుస్తోంది. తెడ్డువదిలేసి పడుకున్నా న్నేను. నన్ను చూసి నవ్వాడు. "నాకిదంతా అలవాటేలే! పడుకోవాలనుంటే పడుకో" అన్నాడు.

మనసులో భయం భయంగానే వుంది. అయినా ధైర్యంచేసి కూచున్నాను. వెన్నెలతో నిండిన ఆకాశం తల మీద కన్పిస్తోంది. ఎప్పుడు నిద్రపట్టేసిందో వొళ్ళు మరిచి పడుకున్నాను. లేచేసరికి యింకా పడవ నడుస్తోంది. గాలి విప రీతంగా వీస్తోంది. మాపడవ అటూ ఇటూ కొట్టుకొంటోంది. కొద్దిగా నీరుకూడా మా పడవలోకి వచ్చేసింది. నాకు భయం వేసింది. లేచి కూచొన్నాను. తెడ్డు వేయడం మానేసి ఎదు రుగ్గా మొణుకులమీాద తల ఆనించి కూచున్నాడు రజీ. నేను బేజారై త్తిపోయాను

"రజీ!" అనరిచాను. నాకు తెలీకుండానే నాకు ఏడు పొచ్చేసింది.

త్రుళ్ళిపడి తలెత్తాడు వాడు. నవ్వడానికి ప్రయత్నిం చాడు. నేను చుట్టూచూశాను. డాల్ఫిన్స్‌నోస్ కొండలు దూరాన చీకట్లో కన్పిస్తున్నాయి. నాకు భయం వేసింది.

"ఎక్కడి కొచ్చాం రజీ!"—అన్నాను అతని దగ్గరికి బద్దీల్ని దాటుకునివస్తూ.

"భయపడకురా" అన్నాడువాడు. కాని వాడిమాట ల్లోనే భయంకన్పిస్తోంది.

"నీకు దేవుడిమీాద నమ్మకం ఉందా?"

"ఊఁ, ఏం?"

"ఉంటే ప్రార్థించు"

"చచ్చిపోతామేమిటి మనం?"

"ఏమో?"

"ఎక్కడికి వచ్చాం?"

"ఏమో!"

"నన్నేడిపించకు రజీ!–నీకు నా చచ్చినతొండని యిచ్చేస్తాను. నా రంగులబెత్తం యిస్తాను. నన్నింటికి పంపేయ్."

"నీ బెత్తంమాట అలా ఉంచు. గాలికి పడవ సముద్రంలోకి వచ్చేసింది. చూశావా మనం బయల్దేరిన చోటు!–" కొండలవైపు చూపించాడు.

వాటికి దూరంగా జరిగిపోతోంది మా పడవ. లైట్‌హౌస్ వెలుగుమాత్రం కన్పిస్తోంది.

"ఎంతదూరం వచ్చేశాం?"

"రెండు మైళ్ళు."

"నన్నెందుకు లేపలేదు?"

"గాలి జోరెక్కింది.బోటుని మరలిద్దామనుకున్నాను. కాని పక్కకి కొట్టేసింది. నేను ప్రయత్నం చేసేంతలోనే ఒడ్డుదాటిపోయి సముద్రంలోకి వచ్చేసింది."

"ఇప్పుడెలా?"

"ఒడువచ్చేవరకూ కూర్చుందాం." నవ్వేడు.

"నాకు ఏడుపొస్తూంటే నువ్వు నవ్వుతావేం? మా యింకికూడా చెప్పలేదు. చచ్చిపోతే?"

"చచ్చిపోతేయేం?"

వాడి ధైర్యానికి నేనాశ్చర్యపోయాను.

"చావంటే నీకు భయంలేదూ?—చచ్చిపోతే మనం నరకంలోకిపోతాం. నరకంలో వాళ్ళు మనల్ని చాలా బాధలు పెట్తారుట? అవన్నీ భరించగలవా నువ్వు?"

"ఏమోనాకు తెలీదు. వాటన్నిటినీ నే నాలోచించలేదు. కర్ర పెండలముక్క తింటావా?" అని జేబులోంచి తీసి విసిరాడు అదికాస్తా నీటిలో పడిపోయింది. మరోటి యివ్వబోతే "నాకు ఆకలిగాలేదు" అన్నాను.

ఇద్దరం అలాకబుర్లు చెప్పుకొంటూ కూచున్నాం. నాకు రానురాను ధైర్యం వచ్చేసింది.

"ఇద్దరం ఎప్పటికీ యిలా పడవలో ఉండిపోదామా?—మరింక ఎప్పటికీ యింటికి వెళ్ళొద్దు. ఏం? అన్నాను నేను.

"అంతధైర్యం ఉందీ నీకు?"

"ఏం లేదనుకున్నావా?—పందెం"

"సరే" అన్నాడు వాడు ఎటువేపో చూస్తూ.

అన్నానేకాని ఆలోచించినకొద్దీ నాకేభయంవేసింది. మళ్ళీ పడుకున్నాను. ఈసారి లేచేసరికి తెల్లవారిపోయింది. ఎండ మాపడవలో పడుతోంది. గాలిజోరు తగ్గింది. దూరంగా ఏదో తీరం కన్పిస్తోంది. చుట్టూ చూశాడు. పడవలో రజీ కన్పించలేదు. నాకు కళ్ళనీళ్ళు తిరిగిపోయేయి. ఏడుస్తూకూచున్నాను. అలాఎంతసేపు కూర్చున్నానో తెలీదు. మా పడవ ఏదో తీరానికి వస్తున్నట్టు గమనించాను. ఎవరో మా పడవ కేసి యీదుకొస్తున్నారు.

"రజీ!"—అని మళ్ళీ అరిచాను.

దూరంనుంచి జవాబు విన్పించింది. అప్పటికి శాంత పడ్డాను. వాడుపడవలోకి ఎక్కాడు బట్టలుపిండుకొంటూ. "తీరానికి వచ్చేశాం"అన్నాడు.

పడవ వున్నట్టుండి ఆగిపోయింది.

"ఒడ్డుతగిలింది పడవకి. ఇంకదిగు"అన్నాడు.

కత్తీ, రెండుమూడు వెదుళ్ళూ, మా సంచీ పట్టుకు దిగాం.

"ఆకలిగాఉందా?" అనడిగాడు రజీ పొడినేలమీదకి రాగానే

"ఊఁ"అన్నాను.

"అటువేపు చింతచెట్లున్నాయి పద, చింతకాయ అంటే నీ కిష్టమేనా?"

"ఓ"

"మరి బాదంకాయలూ?"

"అవీను"

"అయితేపద. కొట్టుకుందాం"

మధ్యాహ్నంవరకూ ఎన్ని కొట్టుకుతిన్నామో లెక్క లేదు. దగ్గర్లో మనిషి అలికిడి ఏదీలేదు. తినడం అయాక కొంచెంసేపు ఆటలాడుకొన్నాం. తర్వాత కబుర్లు చెప్పుకున్నాం. సాయంకాలమయింది. మళ్ళీ యిన్ని బాదంకాయలు తిని కడుపునింపుకున్నాం.

పడుకునే వేళకి—నాకు బెంగపట్టుకుంది. కాని గట్టిగా అంటే నన్ను పిరికివాణ్ణని ఆటపట్టిస్తాడని భయమేసింది.

"ఇలా ఎన్నాళ్ళుండిపోదాం రజీ?"

"ఎప్పటికీ ఉండిపోదాం అన్నావుగా? హాయిగా ఈదుతూ, బాదం కాయలు, సీమచింతకాయలూ తింటూ, పడివమి కాస్లుకొంటుతూ తిరగొచ్చు. నీకుభయమేస్తే చెప్పు యింటిదగ్గర దిగబెట్టివస్తాను."

"అబ్బే! అందుకోసం కాదు; ఇలా వుండిపోవడం నాకూ యిష్టంకాదనుకున్నావా? - హేయ్! మరెప్పుడూ యింటిమొహం చూడనే చూడను!"

కొంతసేపు మాట్లాడలేదు.

"ఈపాటికి బాబాయి నాకోసం వెదుకుతూ ఉంటాడనుకుంటాను. మరి మీబామ్మ నీగురించి వెదుకొద్దూ?"

"ఊఁహూఁ"

"ఏం"

"నేను రోజుల కొద్దీ కన్పించకపోయినా మళ్ళీయింటికి వచ్చేస్తానని ఆమెకు తెల్సు"

"మరి యీ సారి రావుగా?"

"అవును. చాలారోజులతరువాత తెలిశాక ఏడుస్తుంది"

"నాగురించి వెదుకుతూంటారనుకుంటాను."

"అవును."

"మరినేను బడికి వెళ్ళక్కర్లేదుకదూ?"

"అవును"

"ఇంటికెళ్ళాక మనం ఎలా ఎలా యివన్నీ తిరిగామో మా వాళ్ళందరితో చెప్పేస్తాను. అంతా దంగైపోతారు.

"మరి వెళ్ళంగా!"

"అవునవును మర్చిపోయాను. పోనీ రజీ!-ఒక్కసారి వెళ్ళివద్దాంఏమిటి?-పోనీ వెళ్ళొద్దులే......నీయిష్టం......"

మరి మాట్లాడలేదు నేను. ఇద్దరం చెట్లక్రిందపడుకున్నాం. మర్నాడు కూడా అలాగే గడిపాం సరదాగాపరుగులెడుతూ, గెంతుతూ. రంగురంగుల రాళ్లు ఏరాం.రజీతెచ్చిన కత్తితో ప్రతిచెట్టుకీ మాపేర్లుచెక్కేశాం. బాదంకాయలన్నీ అయిపోయేక నేరేడుకాయలమీద పడ్డాం. కాస్త వగరుగా వున్నా నమిలేశాం.

చెట్లన్నీ వెదికి రెండు పాముకుబుసాలూ, చచ్చిన ఉడతలూ, ఈత బెత్తాలు ఏరుకొచ్చాం. కొంతసేపు రాజూ, మంత్రి ఆట ఆడాం. ఆ అడివి అంతటికీ రాజు రజీ, నేను మంత్రిని. భలే తమాషాగా జరిగింది ఆట. రెండు మూడు తాటిమట్టల్ని కత్తులుగా తీసుకుని అలిసిపోయేవరకూ రెండు మూడు కొండల్ని ధ్వంసంచేశాం. నాకాలిలో రెండు ముళ్ళు గుచ్చుకుపోయేయి. రజీ కాలు బెణికింది. అక్కడితో ఆట ఆపేశాం. మరెప్పుడూ ఆ ఆట ఆడకూడదనుకున్నాం. తర్వాత బట్టలన్నీ పడేసి గంటలకొద్దీ యీతకొట్టాం. తల ఆడి స్త్రీచాలు బాబాయి కొప్పడేవాడు. కాని యిప్పుడు ఎంతసేపు స్నానం చేసినా అడిగేవాడు లేడు.

మరోరోజుకూడా యిలా గడిచాక విసుగెత్తింది. వెంటనే యింటిమీదికి పోయింది దృష్టి. మళ్ళీ నాకు బెంగ పట్టుకుంది. ఆనాడు అర్థరాత్రి లేచేసరికి చుట్టూ చెట్లూ కొండలూ. సముద్రం కన్పించడంతో భయంవేసింది

బాబాయి జ్ఞాపకం వచ్చాడు. ఇంతలో తీతుపిట్ట ఎక్కడో అరిచింది. అది అరిస్తే ఎవరో చచ్చిపోతారుట-మా బాబాయి చెప్పాడు. వెంటనే నాకు ఏడుపొచ్చేసింది. భోరున ఏడ్చేశాను. రజీ తుళ్ళిపడి లేచాడు. ఎంత ఓదార్చినా నాకు దుఃఖం ఆగలేదు.

నా ఏడుపు చూసి విసిగి చివరికి అన్నాడు. "అయితే పద నిన్ను దిగబెట్టి వస్తా" నని లేచాడు.

ఇప్పుడిక నేను కాదనలేదు. 'పద' అన్నాను.

మేం అక్కడ కూడబెట్టినవన్నీ మూటకట్టుకుని పడవలో వేసుకున్నాం. అర్థరాత్రిలో ఆ పేరు తెలీని-చోటుని వదిలిపెట్టి బయల్దేరాం. లైట్‌హౌస్ మిణుగురు పురుగులా కన్పిస్తోంది దూరంగా. ఉత్సాహంగా తెడ్డు వేస్తున్నా నేను. రజీకూడా అదేపని చేస్తున్నాడు.

"నువ్వో ఉత్త బెదురుగొడ్డువి. రేపిహామ్ముందుకి పడవలో తీసికెళ్దామనుకున్నాను. మరి రెండు మైళ్ళుపోతే భీమిలీ వస్తుంది. ఎంతో బాగుంటుంది బీచి."

నేను మాట్లాడలేదు.

"ఛీ! నీతో రావడం పొరపాటుచేశాను."

నేను ఆకాశం వేపు చూస్తున్నాను.

"నువ్వింకా ధైర్యవంతుడివని ఎన్నో ఆలోచించాను. దొంగల నాయకుడిలాగ ఈ ద్వీపాన్ని మన నివాసంగా ఏర్పాటుచేసి, సముద్రపు దొంగల్ని పోగుచేసి, ఓడలు దోచేందుకు ప్లాను వేశాను.

"నువ్వా, నేనూ-నా?"

"ఏం? సముద్రం దొంగలు పెద్దవాళ్లుగానే ఉండా లేమిటి?-వాళ్ళ చేతుల్లో బాకులుంటాయి. కొమ్ముబూర లుంటాయి. చూడు కావలిస్తే నాదగ్గరొకటుంది. ఆనాడు జామచెట్టుమీదనుంచి యీ బూరాయే ఊదేసరికి మీ బాబాయి బెదిరిపోయాడు." అని పడవ అడుగున దాచిన బూరాతీసి పడవమీద మహాయోధుడిలాగ నిలబడి గట్టిగా ఊదేడు. వాడు చెప్పింది నిజమే. ఆ శబ్దానికి నావొళ్ళు ఝల్లు మంది. మూడు నాలుగు పర్లాంగులవరకూ విన్పించి ఉంటుంది.

రజీ అన్నంతపనీ చేసేవాడేననిపించింది.

"మరి నాకీ విషయం అక్కడుండగానే చెప్పలేదేం?"

"నువ్వు ఆడదానిలాగ యింటికిపోదాం అని ఏడుస్తూ కూచున్నావుగా?"

సిగ్గేసింది నాకు. "బాబాయిని చూడాలనిపించిందిరా. ఈసారి అలా అననులే!" అని అన్నాను. నా పిరికితనానికి నన్ను నేనే తిట్టుకున్నాను.

"మరి నువ్వు లాభంలేదు. ఈ మాటు నిన్ను తీసు కొస్తానేమో చూడు" అన్నాడు కోపంగా.

"అయితే నా గోళీలూ, నా గాలిపడగా నాకిచ్చేయ్."

"ఇచ్చేస్తాలే, వెధవ గోళీలు ఎవడిక్కావాలి?"

"ఇక్కడ మనం సంపాయించిన వస్తువలన్నీ వంతు వేసెయ్."

ఇద్దరం ఎదురెదురుగా కూచుని వంతువేసేసుకున్నాం. నా వంతుకి అయిదు బాదంకాయలూ, ఒక తాటిబెత్తం, యిరవై రంగురాళ్ళూ, ఒక తాటిముల్లూ, చచ్చిన ఉడతా

వచ్చింది. వచ్చిన ఉడత కాస్త పెద్దవస్తువవడం మూలాన-వాడికి నష్టపరిహారంగా మూడు బాదంకాయలూ, అయిదు నేరేడు కాయలూ, పది రంగు రాళ్ళూ యిచ్చేయవలసి వచ్చింది.

ఇలా పడవలోనే యిద్దరం విడిపోయి రెండు చివర్లకీ చేరిపోయాం. నేను తెడ్డు వేయడం మానేసి కాళ్ళు బార్లా జాపి పడుకున్నాను. వాడే నడుపు తున్నాడు.

తెలతెలవారుతూండగా నన్ను లేపాడు రజీ, లేచి చూసేసరికి ఊరవతల "శాంతి ఆశ్రమం"కి యివతల ఒడ్డుకి కొట్టేసివుంది పడవ.

"ఇసికలోంచి యిది కదలడంకష్టం దిగిపో" అన్నాడు. ఇద్దరం దిగిపోయాం.

"నీ దగ్గర పెన్సిలుందా" అన్నాడు. జేబులన్నీ వెదికాను. చిన్నముక్క దొరికింది.

"ఎక్కడయినా కాగితంముక్క దొరుకుతుందేమో చూడు."

కాగితంముక్క వెదికి తెచ్చాం. "నాకు వ్రాయడం అంతగారాదు. చెప్తాను వ్రాయి" అన్నాడు రజీ.

వ్రాశా నిలాగ.

పడవయజమానికి,

నీ పడవ కొందరు ఓడదొంగలు ఎత్తుకుపోతూండగా మేం అడ్డగించి ఊరవతల కొబ్బరితోటదగ్గిర ఉంచేశాం. వెంటనే వెళ్ళి తెచ్చుకోవలసింది. ఈ సహాయానికి నువ్వేం మాకు ప్రతిఫలంయివ్వక్కర్లేదు. ముందుముందు జాగ్రత్తపడ

వలసిందిగా ప్రార్థిస్తున్నాం. నీదగ్గిరకివచ్చే కుర్రాళ్ళకిమాత్రం అడిగినప్పుడల్లా పడవయిస్తూండు.

ఇట్లు
నీ శ్రేయోభిలాషులు.

చెప్తూంటే తడువుకు తడువుకు రాసేశాను. వాటిలో కొన్నిమాటలు నా కర్థంకాలేదు. కాని ఉత్తరాలు అలాగే వ్రాయాలిట-రజీ ఎక్కిడ్సో విన్నాట్ట అలావ్రాయడం—

"రైటో, దీన్నితీసుకుపోయి-తెల్లారగానే-ఆనాడు మనం బయల్దేరినచోట ఉండే పడవతాత కిచ్చేయ్. అన్నట్టు తాతకి చదువురాదు-నువ్వేచదివి విన్పించు. ఎవరిచ్చారీ ఉత్తరం అంటే ఎవరో పెద్దదొంగల్లా వున్నారని చెప్పు" అన్నాడు రజీ.

సరేనన్నాను. ఇద్దరం ఊర్లోకిబయల్దేరాం ఎవరి సామానులు వాళ్ళుపట్టుకుని. విడిపోయేస్థలంవచ్చాక వాడిని అడిగాను.

"అయితేరజీ! నా జట్టు పూర్తిగా విప్పేశావా?"

"జట్టు విప్పెయ్యలేదు. కాని మరెప్పుడూ యిలా తీసి కెళ్ళను" అన్నాడు. అనేసి వెళ్ళిపోయాడు.

నాకు ఏడుపొచ్చింది. పిరికి వెధవనుకొని నన్ను నేనే కొట్టుకున్నాను. బిక్కమొహంతో సామాను మోసుకొంటూ యింటి కొచ్చేశాను.

# 7

నన్ను చూడగానే బాబాయి బావురుమనిపడ్చి నన్ను కౌగలించుకున్నాడు. నాకూ ఏడుపొచ్చేసింది అతన్ని చూడ గానే. నన్ను చూసీ చూడడంతోటే చితకతంతాడనుకు న్నాను. కాని అలా జరక్కపోవడంతో కాస్త ధైర్యం చిక్కింది. వెంటనే అన్నాను, "ఇంకెప్పుడూ ఎక్కడికీ పోను బాబాయ్!– నీతోడు"

"అసలు నువ్వెక్కడికి వెళ్ళావురా! చెట్టుమీంచి ఆమ్మ గం అరవగానే కళ్ళు మూసుకున్నాము! మళ్ళీ కళ్ళు విప్పే సరికి నువ్వు కన్పించలేదు. నాకు ఏడుపొచ్చేసింది. నీకోసం అంతా వెదికాను. అందరూ వెదికారు. నువ్వు కన్పిస్తేనా?— ఈమూడురోజులూ తిండీ తిప్పలూ లేవనుకో"

నాకు బాబాయిమీద జాలేసింది. అప్పుడప్పుడు కొడ తాడన్నమాటేగాని మంచివాడేనని నిర్ధారణ చేసుకున్నాను.

"ఎలా మాయమయిపోయావురా నీవు?"

"అదంతా పెద్ద కథలే!"

"సరే! మొదట బట్టలుమార్చుకో. ఇవి తడిసిముద్దయి పోయాయి. నేనిప్పుడే ప్రక్కవాళ్ళందరికీ కబురుచెప్పి వస్తాను." అని బయటికి వెళ్ళేడు.

క్షణంలో ఓ వందమంది నన్ను చుట్టుముట్టేశారు. బట్టలుమార్చుకుని వెచ్చగా ధీరుడిలాగ మంచంమీంద కూర్చొన్నాను నేను.

"ఎక్కడికి వెళ్ళావురా గోపూ!" అసడిగారు అంతా.

ఇక ప్రారంభించాను చెప్పడం. మధ్యమధ్య నాకు తెలీకుండానే రోజులు కలిసిపోయాయి. ఆనాడు చెట్టుమీంచి పెద్ద దెయ్యం ఎత్తుకుపోయిందనీ, ఊర్లన్నీ తిప్పిందనీ, రెండు మూడు ద్వీపాల్లో మిగతా దెయ్యాల్ని చూపిందనీ, నేను తెచ్చిన వస్తువులన్నీ అదే యిచ్చిందనీ, డబ్బు యిస్తానంటే నేనే వద్దన్నాననీ, తర్వాత యింటిదగ్గర వదిలెయ్యమంటే సరేనందనీ- యిలా నోటికివచ్చినట్టు చెప్పేశాను.

"మొదట నన్ను పెంచుకుంటానంది ఓ ముసలి దెయ్యం. మా బాబాయి ఏడుస్తాడు వద్దన్నాను."

కొందరు నమ్మలేదు. కొందరు నోళ్ళు వెళ్ళబెట్టుకు వింటూ కూచున్నారు. వాళ్ళందరిమధ్యా పెద్ద ఆరిందాలాగ కూచ్చుని చెప్పడం నాకు భలే సరదా వేసింది.

అంతా వెళ్ళిపోయేక బాబాయ్ నాకు దిష్టి తీశాడు. ఆ రాత్రంతా అలసిపోయి ఉండడంవల్ల బాగా నిద్రపట్టేసింది. కాని యీ మూడు నాలుగురోజులూ నీటిలో నానడంచేతా, యిష్టంవచ్చినట్టు గెంతడంచేతా, ఓ పక్క భయం, మరో పక్క బెంగచేతా, తెల్లవారేసరికి జ్వరం వచ్చేసింది- బాబాయి భయపడిపోయాడు.

"వద్దంటే విన్నావుకాదు. దెయ్యాల సావాసం కూడ దురా!" అని మొత్తుకున్నాడు.

"చేస్తే ఏం బాబాయి!"

"మన వంశమంతా నాశనమయిపోతుందని శపిస్తాయి."

"మరి రజీ దెయ్యాన్ని నమ్మాడుకదా, అతని వంశం కూడా నాశనమయిపోతుందా?"

"రజీ ఎవడు?"

"ఆనాడు నువ్వు మైదానంలో కొట్టావే!-వాడు."

"ఆరి అల్లరి వెధవా!" - అని ఆశ్చర్యపోయాడు బాబాయి. అంతలో ఆయనకేదో తోచింది. చటుక్కున మంచంమీదనుంచి లేచి నిలబడ్డాడు. 'గోపూ!' అనరిచాడు. నేను తెల్లబోయి చూశాను.

"దెయ్యాలూ లేవు, ఏమీ లేవు. నేను మొదట్నుంచీ అనుమానిస్తూనే ఉన్నాను. నిజం చెప్పు. రజీ నువ్వు ఎక్కడెక్కడికి తిరిగావు?"

"లేదు బాబాయ్!" అనబోయి అతని మొహంచూసి ఆగిపోయేను.

"ఎవరితో చెప్పవుకద!"

"ఊహుఁ"

"ఆనాడు పిల్లి అరుపు విన్పించింది చూశావ్"

"అవును?"

"అది పిల్లి కాదు బాబాయ్! రజీయే! మీరు భయపడ్డ దెయ్యంకూడా రజీయే!"

దిమ్మెరపోయేడు బాబాయ్.

"ఎంత ఘటికుడురా వాడు!" అని గొణిగాడు.

"ఇకనుంచి వాడి స్నేహం మానెయ్" అని గట్టిగా హెచ్చరించాడు.

"వాడే నా స్నేహంచేశాడు బాబాయ్. యిక చస్తే అతనితో కలవను" అన్నాను.

అప్పటికి శాంతించాడు. "ఉండు పాలు తెస్తాను" అని లేచాడు.

ఇంతలో కిటికీదగ్గర 'గోపూ' అన్న పిలుపు విన్పించింది. అటు వేపు చూశాను. రజీ నిలబడివున్నాడు. భయం వేసింది.

"ఉత్తరం యిచ్చేయ్! ఉత్తరం!" అని సంజ్ఞచేశాడు. నా తలగడికిందే ఉందది. వెంటనే యిచ్చేశాను.

"నువ్వివాళ అక్కడికి వెళ్ళలేవు. నేనే యిచ్చేస్తాలే. నాలుగు రోజులు ఎక్కడికీ తిరక్కు, పడుకో" అని పారిపోయాడు.

వాడిగురించే ఆలోచిస్తూ పడుకున్నాను.

ఈ జ్వరం తగ్గడానికి పదిరోజులు పట్టింది. కాని జ్వరం ఉన్నన్నాళ్ళూ, ఏదడిగితే అది తెచ్చియిచ్చేవాడు బాబాయి. ఏపిల్ పళ్ళూ ద్రాక్షపళ్ళూ, నారింజ, బత్తాయి – అన్నిరుచి చూసేశాను. మరి నాలుగురోజులు జ్వరంవుంటే బావుణ్ణనిపించింది. కాని పది రోజులకే తగ్గిపోయింది.

పదకొండో రోజున బడికివెళ్ళేనేకాని తప్పలేదు. మెల్లగా పుస్తకాలూ, పలకా పట్టుకుని బయల్దేరాను. నా స్నేహితులంతా నన్ను విచిత్రంగా చూస్తున్నారు.

"ఏమిట్రా అలా చూస్తున్నారూ?"

"నిన్ను దెయ్యం ఎత్తుకుపోలేదూ?" అని గొణిగాడు గోవిందు.

"మళ్ళీ యింటికి పంపేసింది."

"అయితే ఎత్తుకుపోవడం నిజమేనన్నమాట!"

"ఆహా! అక్షరాలా నిజం"

"ఒరే ఏంచేసిందిరా దెయ్యం?"– కిష్టిగాడు ఆత్రుతగా అడిగాడు.

"అదంతా పెద్ద కథలే."

"పోనీ చెప్పరా" అన్నాడు కన్న.

"ఇప్పుడు అవదురా – బడిగంట కొట్టేస్తారు" అని నసిగాను.

నా సంగతి తెలిసినవాళ్ళంతా లంచం యివ్వడానికి పూనుకున్నారు. గోవిందు రంగుసుద్దముక్కలిచ్చాడు. కిష్టుడు అట్టపెట్టే, రాజీ ఎండు కొబ్బరి – ఇలా తలా ఒకడి దగ్గరా ఒక్కొక్కటీ పోగుచేశాను. మూడోక్లాసు కుర్రాళ్ళంతా నా చుట్టూ చేరిపోయేరు. అందర్నీ కూచోపెట్టి దెయ్యాలకోతలన్నీ కోసేశాను. అందరూ నోరు విప్పుకు వింటూ కూచొన్నారు. దూరంగా ఆడపిల్లల బెంచీ మీద నిర్మల అనే అమ్మాయికూడా ఈవిషయంవింటోందని పసిగట్టి మరికాస్త గట్టిగా యింకా కోతల్ని మిళాయించి చెప్పడం ప్రారంభించేశాను.

దెయ్యం నన్ను అచ్చంగా తనదగ్గరే ఉండిపొమ్మందిట. మంచి మంచి బట్టలు కుట్టిస్తానందట. రకరకాల గోళీలు యిస్తానందిట. రత్నాలూ, కిరీటాలూ–సాయిబుకుట్టే చెప్పులు కన్న మంచి చెప్పులు కొనిపెడ్తానందిట — యిలా నోటికి వచ్చినవన్నీ వాగేశాను. నిర్మలకూడా నోరువిప్పుకు వినడం

గమనించి పొంగిపోయేను. అందరూ నన్ను పెద్ద దేవుణ్ణి చూసినట్టు చూడసాగారు. అందరికీమధ్య మేష్టారిగారి కుర్చీ మీద నేను కూచున్నాను. ఒకొక్కక్కరూ ఒకోక్క ప్రశ్న అడిగారు. అన్నింటికీ జవాబులు చెప్పాను.

ఇంతలో గంట కొట్టేశారు. మా సమావేశం పూర్తయింది. క్లాసులో అందరూ నా ప్రక్కనే కూర్చుందుకి ప్రయత్నించారు. కాని ఎందుకొబ్బరిచ్చిన రాజిగాణ్ణీ, కోవా బిళ్ళలిచ్చిన కన్ననీ, నా పక్కన కూర్చోనిచ్చాను. మిగతా వాళ్ళంతా అటూ ఇటూ సర్దుకున్నారు. నేను మాత్రం మహా వీరుడిలాగ మధ్యన కూర్చొన్నాను. నిర్మల ప్రతిసారీ నా వేపు చూస్తూండడం గమనించాను. అయినా నిర్లక్ష్యంగా తెలీనట్టు కూచొన్నాను—

పంతులుగారు పాఠం చెప్పుకుపోతున్నారు. ఉండుండి నా వేపు వంగాడు కన్న. "సాయంకాలం గోళీలాట ఆడుదాంరా" అన్నాడు.

"ఓ! నేను రెడీ, ఆటలో ఫస్టు నాది అబ్బాయ్. ఇప్పుడే చెప్తున్నాను" అన్నాను.

"సరే ఫస్టునీదే" అన్నాడు. ఇద్దరం ఆడడానికి వప్పు దలచేసుకున్నాం. ఇంతలో రాజీ నా వేపు తిరిగి చెవిలో మెల్లిగా అన్నాడు.

"ఇవాళ సాయంకాలం దొంగా పోలీసు ఆట ఆడాలిరా గోపూ" అన్నాడు. గోళీలాటకంటే యిది బావున్నట్టు తోచింది.

"మరి తుపాకులూ?" అన్నాను.

"మా అన్నయ్య రెండుకొనితెచ్చాడు మద్రాసు నుంచి. ఒకొటి నీ కిచ్చేస్తాను"

"అచ్చంగా నే?"

"ఓ!"

నాకు ఉత్సాహం పట్టలేనంత కలిగిపోయింది. "నువ్వు చాలామంచివాడివిరా రాజీ!—ఎప్పటికీ నీ స్నేహం వదిలిపెట్టను. రైట్. ఒప్పుకున్నాను. సాయంకాలం పోలీసు దొంగా ఆటే ఆడదాం" అంటూ కన్నవైపుతిరిగి "ఇవాళ్టికి గోళీలాట మానేద్దాంరా. వొంట్లోబాగా లేదు" అని టక్కు-వేశాను. వాడు మూతిముడుచుకు పక్క-కిజరిగి కూచున్నాడు.

అప్పటికి క్లాసు నిశ్శబ్దమయిపోయింది. పాఠం చెప్పడం అపేశారు పంతులుగారు. నేను తలెత్తేసరికి బెత్తంతో నా బెంచీదగ్గర సిద్ధమయ్యారు

"నాలుగురోజులు పూరువదలి పారిపోవడమేకాకుండా పాఠం వినకుండా కుచ్చిటప్పాలు కొడుతున్నావా?–చెయ్యి పట్టు వెధవా?"

ఇక అక్క-డసిగ్గుపడితే లాభంలేదనుకున్నాను. యోధుడి లాగ చెయ్యి జాపాను. బెత్తం విరిగేంతవరకూ కొట్టారు.

ఇదివరకయితే పిల్లలు గొళ్ళున నవ్వేవారేమోగాని యిప్పుడు నాధైర్యసాహసాలు విన్నతర్వాత కిక్కు-రుమన లేదు. పైగా పంతులుగారివైపే కొరకొరా చూశారు. బెంచీ మీద కూచొంటూ నిర్మల ఏంచేస్తోందో అని చూశాను. నా వేపు చూసి జాలిపడింది. అక్క-డితో నాకు బలే ధైర్యం

వచ్చేసింది. కాలుమీదకాలు వేసుక్కూచున్నాను. అంతలో మరో ఆలోచనవచ్చింది. వెంటనే లెక్కలబుక్కులోంచి తెల్ల కాగితం చింపాను. కుదురుగా గుండ్రటి అక్షరాల్తో యిలా వ్రాశాను:

"నిర్మల చాలామంచిపిల్ల. ఏమంటావ్?"

ఇలారాసి రజీకి యిచ్చానుకాగితం. "ఏమిటిది?" అన్నాడువాడు బోధపడక.

"నిర్మల మంచిదేనని నీకూ అనిపిస్తే అవునని సంతకం చెయ్యి" అన్నాను.

వెంటనే అవునని వ్రాసి సంతంపెట్టేశాడు. "ఇంద"

"నీ ప్రక్కవాడికియ్యి వాడితోకూడ అలాగే చెప్పు"

కాగితం పంతులగారిదృష్టికి అందకుండానే చేతులు మారిపోయింది. అందరూ కుదురుగా అవునని వ్రాసి సంతకాలు పెట్టేస్తున్నారు. నిర్మల యిదంతా చూస్తోంది ఏమిటో నని. నావేపుచూసింది. నేను అదేమీ తెలీనట్టు పుస్తకంవేపే చూస్తున్నాను.

క్లాసులోని అబ్బాయిలంతా సంతకంచేసేశాక కాగితం మళ్ళీ నాదగ్గరికి తిరిగివచ్చేసింది. తృప్తిగా సంతకాలన్నింటినీ చూసి, కాగితాన్ని మడిచి జేబులో పెట్టుకున్నాను. మళ్ళీ ఏదోతోచి మరో కాగితంమీద వ్రాశాను.

"నిర్మల చాలా అందమయినపిల్ల. ఏమంటావ్?"

దీనిక్కూడా యిలాగే అందరూ సంతకాలుచేసేశారు. ఇంతలో గంటకొట్టేశారు.

"పుస్తకాలు పడేసి మైదానందగ్గిరికి వచ్చేయ్. నేను రెడీగా ఉంటాను" అన్నాడు రాజిగాడు.

"సరే" అన్నాను.

వీధి మలుపుకి వచ్చేసరికి 'గోపూ!' అని ఎవరో పిలిచారు. వెనక్కి తిరిగి చూసి ఆశ్చర్యపోయాను. నిర్మల పుస్తకాలసంచీ పట్టుకుని పరుగెత్తుకు వచ్చింది–

నిర్మల తాసీల్దారుగారమ్మాయి. వాళ్ళ బంట్రోతులు ఆ అమ్మాయితో ఎవర్నీ మాట్లాడనివ్వరు. అల్లరి సావాసాలవుతాయని వాళ్ళ నాన్న కోప్పడతారట. నిర్మలకి తొమ్మిదేళ్ళుంటాయి. నాకు పదకొండు. రెండుజడలూ, ఎర్రటిపరికిణీ పొట్టిగా పిచికలాగ ఉంటుంది.

"ఏం!" అన్నాను.

మొదట్లో మాట్లాడ్డానికి తటపటాయించి దిక్కులు చూసింది.

"ఫరవాలేదు చెప్పు. నీకేం భయంలేదు. నేనున్నానుగా?"

"మరి...మరి...దెయ్యం ఎలావుంటుందేమిటి గోపూ?"

నేను గాభరాపడ్డాను. ఇటువంటిప్రశ్న ఎవ్వరూఅడగలేదు. అంచేత కాస్సేపు తికమకపడి నవ్వేస్తూ "చాలా అందంగా ఉంటుందిలే!" అన్నాను.

"మరి కాళ్ళూ చేతులూ చూశావా?"

"చూశాను. ఏం?"

"దెయ్యాలకి కాళ్ళూ చేతులూ కన్పించవుగా?"

ఈసంగతి ఆహడావుడిలో మర్చేపోయాను. ఇక యిప్పుడు

సర్దుకొంటూ "ఇవికొత్తరకం దెయ్యాల్లే! నీకు తెలీదు" అన్నాను.

"దెయ్యం నీతో మాట్లాడిందా గోపూ?"

"ఇవ్వాళయ్యా దెయ్యంతో నేగా మాట్లాడివచ్చాను?"

"ఏమిటి మాట్లాడావు?"

"ఓ యబ్బో! చాలా చెప్పాను. మాబడిలో ఓ మంచి అమ్మాయి ఉందనీ, ఆ అమ్మాయి చాలా మంచిదనీ."

"నిజంగా?"

"నీతోడు"

"సరే అప్పుడా దెయ్యం ఏమిటంది?"

కావాలంటే యిప్పుడే ఆ అమ్మాయిని తెచ్చేస్తానంది.

"తెచ్చేయమనలేక పోయావా?"

"నువ్వు మీనాన్నా, అమ్మకోసం ఏడుస్తావని భయ పడ్డాను"

"మరి నేను నీతో వచ్చేస్తే అమ్మానాన్నా ఏడవరూ?"

"పోనీ వాళ్ళనీమనతో తీసుకుపోదాం. ఏం?"

"అయితేసరే. మరి మీ బాబాయి?"

"మా బాబాయి ఆడదానిలాగ ఏడవడు. యీ లోక మంతా, యీ ప్రపంచమంతా తిరిగినాసరే! అచ్చంగా యింటికి రాకపోయినాసరే!"

"అబ్బా!"

"మరేమిటనుకున్నావ్?-ఉండు యింకా చాలావిష యాలు చెప్పాలినీకు. బడిలోకూచుందామా?"

"పద" అంది!

బడి వెనక తోటదగ్గర కూచొన్నాం. తోటమాలి పోతన్న మొక్కలికి నీళ్ళు పోస్తున్నవాడల్లా మమ్మల్ని చూసి రెండు గులాబిపువ్వులుకోసి యిచ్చాడు - నాకొకటి నిర్మలకొకటీను. నాపువ్వుకూడానిర్మలకేయిచ్చేశాను. ఇద్దరం గట్టుమీాద కూచొన్నాం.

దూరంగా పారిపోతున్న రాజిగాణ్ణి పిలిచిచెప్పేశాను. "ఏమీా అనుకోకురాజీ! అర్జంటుపనిఉంది. రేపు ఆడదాం దొంగా పోలీసూను."

రాజీఏడుపుముఖంపెట్టేశాడు "అదేమిటిరా!"అన్నాడు.

ఇక్కడ కోతకొయ్యకపోతే లాభంలేదనుకుని, "నిన్నటి దెయ్యం నాతో మాట్లాడాలని కబురు పంపించిందిరా. వెంటనే వెళ్ళి మాట్లాడాలి."

"అయితే తప్పకుండా వెళ్ళిరా."

"మరి నాకు తుపాకీ అచ్చంగా యిస్తున్నావా!"

"అలాగే"

వాణ్ణి పంపిచేసేక మళ్ళీ తోటలోనికి వచ్చేసేను.

"నువ్వు చాలామంచిదానివి నిర్మలా!" అన్నాను కూచోగానే.

"అన్నీ అబద్ధాలు"

"కావలిస్తే యీా కాగితంచూడు" అని పిల్లలందరిచేతా సంతకాలు చేయించిన కాగితంచూపాను. నిర్మలచూసి నవ్వేసింది.

"మరోగమ్మత్తు చూపుతాను ఎవరితో చెప్పవుకదా!"

"ఊహుఁ"

"ఒట్టువెయ్యి"

వేసింది. "గిల్లు"

గిల్లింది.

"మెల్లిగా రెండో కాగితంతీశాను. ఒక కల్రపుల్లతీసి మల్రతం వేశాను కళ్లుమూసుకుని. ఆమెని కళ్ళు మూసుకో మన్నాను. వెనక్కితిరిగి ఎడమచేత్తో నిర్మలఒడిలో పడేశాను.

దాన్ని విప్పి చూసుకుంది.

"నిర్మల చాలా అందమయినపిల్ల!"

"ఛీ! యిలా అయితే నే పారిపోతాను."అని లేచింది.

"మరయితే దెయ్యంకథ చెప్పను-నిన్నక్కడికి తీసి కెళ్ళను-"అంటే ముక్కుతూకూచొంది.

"ఎవరితో చెప్పవామరి?-ఒట్టువేశావ్!-చెప్తేకళ్ళుపేలి పోతాయి జాగ్రత్త"

చెప్పనని తరూపింది.

సున్నాగీశాను నేలమీద."మధ్యలోఉమ్ము" అన్నాను.

ఇలా చేశాక రహస్యం చెప్తే అందరూ చచ్చిపోతా రుట-మా బామ్మ చెప్పేది.

భయపడుతూ-భయపడుతూ ఉమ్మింది నిర్మల. నేను అప్పటికి తృప్తిపడ్డాను. "ఈబట్టలు నీకేమీా బాగుండవు నిర్మలా. మాదెయ్యంచేత నీకప్పుడే బట్టలు కుట్టించేశాను."

"నిజంగా!" - మరి నా ఆది తెలియకుండే ఎలాకుట్టిం చావు?"

మళ్ళీ తడబడ్డాను నేను. "రాత్రి నువ్వు పడుకున్నప్పుడు దెయ్యం నిన్ను చూసి వెళ్ళిందిగా?"

"అయితే అక్కడికి ఎప్పుడు వెళ్దాం గోపూ!"

"చెప్తానులే. మళ్ళీ ఓరోజు వస్తుంది దెయ్యం. అసలు నిన్ను తీసుకు పోవడానికే మళ్ళీ తిరిగివచ్చాను. లేకపోతే ఎప్పటికీ రాకూడదనుకున్నాను.

"నువ్వు చాలా మంచివాడివి!"

"ఇక పోదాం లే!" అన్నాను.

నిర్మల లేచింది. "మీ యింటిదాకా దిగబెట్టి వచ్చేదా?" అనడిగాను.

"అక్కర్లేదు. నేను వెళ్ళిపోగల్ను"

"సరే, అయితే నే పారిపోతాను"

"గోపూ!"

"ఏం?"

"ఇలా దగ్గరికి రా—చెవిలో చెప్తాను.

దగ్గరికి వెళ్ళి వంగాను ఏం చెప్తుందా అని—

"నాకా రెండు కాగితాలూ యిచ్చెయ్యవూ?"

"సరే. ఇందు" అని తీసి యిచ్చేశాను. ఆమె సంచిలో వాటిని దోపుకుని సంతోషంగా యింటివేపు పారిపోయింది—

# 8

సుమారు నెలరోజులవరకూ రజీ నాకు కన్పించలేదు. నేనూ అతని దగ్గరికి వెళ్ళలేదు. అప్పటివిషయాలు తల్చుకుంటే నాకెంతో భయం వేసింది. అందువల్ల అతనికి కన్పించకుండా ఉండడమే మంచిదనిపించింది.

రాజిగాడుకొయ్యతుపాకీ తెచ్చియిచ్చాడు. మాస్నేహితులందరితోటీ మామూలుఆటలు మొదలెట్టాను. నిర్మలతో స్నేహం ఎక్కువయింది. నేనేమాట చెప్పినా జాగ్రత్తగా వింటుంది. రోజూ బడితోటలో కూర్చునే వాళ్ళం. దెయ్యం వస్తే ఏంచెయ్యాలో ఆలోచించుకునేవాళ్ళం.

ఇలా రోజులు సరదాగా గడచిపోతున్నాయి.

ఓరోజు నిర్మలా, నేనూ చెట్ల పట్టాలేసుకుని వచ్చేస్తున్నాం. గోపీ!'' అని ఎవరో పిలిచినట్టనిపించింది.

నిర్లక్ష్యంచేసి ముందుకి నడిచిపోయేను. మళ్ళీ విన్పించింది. ఈసారి ఎవరో పిలుస్తున్నారని పోల్చాను. "తొందరగానడు! అన్నాను నిర్మలతో. ఇంతలో రజీ మా దారి కడ్డంగావచ్చాడు.

"నీతో మాట్లాడాలిరా'' అన్నాడు నాతో.

నిర్మల ఆశ్చర్యంగాచూసింది. "ఇప్పుడునాకుతీరికలేదు. తర్వాతవస్తాలే'' అన్నా చికాకుగా.

"అలాకాదు ఇప్పుడేమాట్లాడాలి.నువ్విక్కడే ఉండమ్మాయి!" అంటూ నా చెయ్యిపట్టుకునిదూరంగాలాక్కుపోయేడు. చాలా విచారంగా అన్నాడు."ఎవర్నీ ఎప్పుడూ అడగలేదురా. నిన్నే అడుగుతున్నాను. ఓ బేడ ఉంటే యివ్వు"

"ఎందుకూ?"

"పనివుంది"

బాబాయి పొగాకు తీసుకురమ్మని యిచ్చిన బేడ జేబులోంచి తీసియిచ్చేశాను.

"నీ గాలిపడగ, మట్టిగోళీలూ,ఆనాడు నువ్వునాకిచ్చినవీ అన్నీ ఆ కన్నంలో పెట్టేశాను. పోయితీసుకో"అన్నాడు.

నీకు కావలిస్తే నువ్వేఉంచుకో"అన్నాను.

"నాకువద్దు."

"పడవ విషయం యజమానికి చెప్పేవా?"

"ఆరో జేవెళ్ళి తెచ్చుకున్నాడు. మరి వెళ్తాను"

"ఎక్కడికి పోతావ్?"

"తర్వాత ఎప్పుడన్నా చెప్తాలే"

"పోనీ నేనూ వచ్చేదా నీతో?"

"మరి ఆ అమ్మాయో?"

"ఇంటికి పొమ్మంటాను."

"అయినా వద్దులే"—అని పారిపోయేడు.

నన్ను వదిలేసిపోయినందుకు దుఃఖంవచ్చింది. విచా

రంగా నిర్మలతో కలిసివెళ్ళిపోయేను. రాత్రి పొగాకు తీసుకు రానందుకు బాబాయిచేత తన్నులు తిన్నాను.

మరో పది పదిహేను రోజులవరకూ రజీ కన్పించలేదు. ఎప్పుడయినా వస్తాడేమోనని ఆనాటి దగ్గర్నుంచీ ఎదురు చూస్తూ కూర్చున్నాను. కాని రాలేదు.

ఒకనాడు పొద్దుట బడికిపోతున్నాను. దారిలో దేవాలయం అరుగుమీద మోకాళ్ళమీద తలవుంచుకు కూచున్నాడు రజీ. చూడగానే ఎక్కడలేని వుత్సాహంతో వాడి పక్కకి వచ్చికూచున్నాను. విచారంగా తలెత్తాడు వాడు. మెల్లిగా అన్నాడు.

"నీ కోసమే కూచున్నాను."

"మళ్ళీ బేడ కావాలా? - బేడలేదే!-అణావుంది— యిచ్చేదా?"

"డబ్బుకాదు. నాతో వస్తావా?"

"పద"

"మరి బడికి వెళ్ళవూ?"

"ఇవాళ్టికి మానేస్తాను"

ఇద్దరం నడిచాం.

"ఏం! అలా వున్నావ్?- జ్వరం వచ్చిందా?"

మాబామ్మ చచ్చిపోయింది గోపీ! నిన్న రాత్రి" అన్నాడు తలవొంచుకొని.

నేను తుళ్ళిపడ్డాను. "ఎలా చచ్చిపోయింది?"

"రెండు మూడురోజులు జ్వరం వచ్చింది.నీదగ్గర్నుంచి బేడ తీసుకెళ్ళాను జ్ఞాపకం వుందా? దాంతో బామ్మకి

ద్రాక్షపళ్ళు కొన్నాను. సాయిబు మందిచ్చాడు. నిన్నరాత్రి సర్గ్గా చర్చి పదకొండు కొట్టినప్పుడు చచ్చిపోయింది.''

"పాపం!" అన్నాడు జాలిపడుతూ.

రజీకి కళ్ళ నీళ్ళు తిరిగినట్టున్నాయి. చొక్కాతో కళ్ళు తుడుచుకున్నాడు. మెల్లిగా అన్నాడు "గోపూ! నీకో చిన్న రహస్యం చెప్పేదా?"

"చెప్పు"

"ఎవరితో చెప్పవా మరి?"

"అలాగే"

"విను–బామ్మ దెయ్యమయింది."

"ఆఁ!–నీకెలా తెల్సు?" అన్నాను భయం భయంగా.

"నన్ను రొట్టెకొని తెమ్మంది. నేను పరిగెత్తాను తీసుకు రావడానికి. వచ్చేసరికి చచ్చిపోయింది. చచ్చిపోయేముందు కోరికలేవైనా వుండిపోతే దెయ్యమవుతారట. బహుశా బామ్మ దెయ్యమయి వుంటుంది. మా గుడిసెదగ్గిరే తిరుగుతూంటుం దేమో?"

"అయితేఎలాగ రజీ!"

"ఏం? నీకు భయమా?"

"అబ్బే! లేదనుకో, ఇప్పుడు నన్నెడికి రమ్మంటావ్!"

"మా యింటికి"

నాకు భయం వేసింది. "ఎందుకూ?"

మరి మా బామ్మ చచ్చిపోయిన తర్వాత శరీరం ఊడి పోతుందిగా?–దాన్ని కాల్చెయ్యాలి" – తలవొంచుకునే అన్నాడు.

నాకు వొళ్ళు ఝల్లుమంది.

"మనం ఆపని చెయ్యగలమా రజీ! చుట్టపక్కలవాళ్ళకె వరికయినా చెప్పలేకపోయావా?"

"చాలా దూరంలో తప్ప యిళ్ళు లేవుగా మరి? అయినా మా యింట్లో ఎవరన్నా చచ్చిపోతే ఎవరూ చూడ డానికి రారు."

"ఏం?"

"మమ్మల్ని వెలి వేశారట-బామ్మ చెప్పింది."

"వెలి అంటే?"

"అదేదో నేరం కాబోలు. నాకు తెలీదు"

"అయితే నన్నూ, బాబాయినీ వేశారా మరి?"

"అందరినీ వెయ్యరు. వెలి వేసినవాళ్ళు ఊరికిదూరంగా బతకాలి. వాళ్ళ దగ్గరికి ఎప్పటికీ ఎవ్వరూ రారు. చచ్చి పోయినా రారు."

అయితే మమ్మల్ని వెలివేస్తే బావుణ్ణు! చక్కా ఊర వతల ఆడుకోవచ్చు."

"తప్పు అలా అనకూడదు" అన్నాడు రజీ.

నేను లెంపలు వేసుకున్నాను. మెల్లగా వాడియింటిదగ్గ రికి వచ్చాం. దగ్గరపడుతున్నకొద్దీ నాలో భయం హెచ్చయి పోయింది. కాని పైకిచెప్తే నా స్నేహం పూర్తిగా మానేస్తా డేమోనని చెప్పకుండా ఊరుకున్నాను. కాని కాళ్ళూ చేతులు వణికిపోతున్నాయి.

గుడిసె తలుపు తెరుచుకు లోనికొచ్చాం.

"నువ్వు కళ్ళుమూసుకో గోపీ–మరిచిపోయేను" అనరిచాడు రజీ. నేను గట్టిగా రెండు కళ్ళూ మూసుకున్నాను. మంచంమీదవున్న బొమ్మ శవంమీద దుప్పటికప్పేశాడు. "ఆ కుర్చీమీదకూచో" అన్నాడు. కూచొన్నాను. నేలమీద కూచొని నిమ్మకాయకోసి రెండు గ్లాసుల్లోపోసి యిచ్చాడు త్రాగాను. అప్పటికి కాస్త ఆలోచించ గల్గాను.

"ఇప్పుడు మనం ఏం చెయ్యాలి రజీ!" అన్నాను.

"నాకేమీ తోచలేదు. అందుకే నీ దగ్గరికి వచ్చాను. నువ్వే చెప్పు"

శవాల్ని భూస్థాపితం చేస్తారని చదివాను ఓ చోట. అందుచేత గట్టిగా అన్నా "భూస్థాపితంచేస్తే?"

"అంటే?"

"పెద్దగొయ్యితీసి ఆమె సందులో పడుకోబెట్టేస్తాం. పైన మట్టి కప్పేస్తే మరే బాధా ఉండదు."

ఒక్కక్షణం ఆలోచించాడువాడు. తర్వాత సరే నన్నాడు.

ఇద్దరం ఒక పలుగూ, గునపం పట్టుకుని గుడిసెవెనక్కి వచ్చాం. చుట్టూ ఎవరూ లేరు. మధ్యాహ్నం పన్నెండయింది అప్పటికి. రెండుగంటలయేసరికి పెద్దగొయ్యి తవ్వేశాం.

"ఇక బొమ్మని తీసుకురా" అన్నాన్నేను.

"ఎలా"

నాకూ అదే ప్రశ్న తోచింది "ఎలా తీసుకురావడం?"

"చచ్చిపోయిన తర్వాత శవం బరువెక్కిపోతుంది. తెలుసా?"

ఏలాగయితేనేం పెద్దబల్లమీందకి ఆమెని వత్తిగిల వేశాం, నాకువంట్లో ప్రాణంలేదు. ఆ బల్లకి తాడుకట్టి గుడిసె వెనక్కి యిద్దరం యీడ్చుకొచ్చాం. మెల్లిగా గోతిలో దింపాం.

"ఇప్పుడు దైవప్రార్థన చెయ్యాలి రజీ!" అన్నాను.

"నాకురాదు. నువ్వే. నువ్వే చెప్పెయ్"

పుస్తకాలు చదివింది జ్ఞాపకం తెచ్చుకొంటూ మెల్లిగా చదివాను.

"భగవాన్! మేం అజ్ఞానంలోఉన్నాం. జ్ఞానం ప్రసాదించు. చీకటిలో ఉన్నాం. వెలుగుని ప్రసాదించు. మృతజీవులం మేము. అమృతమయుల్నిగా చెయ్"

"చాలా బావుందిరా ప్రార్థన" అన్నాడురజీ.

తర్వాతకొంచెం సొంతంగా ప్రార్థన సాధించాను: "భగవాన్! ఇప్పుడురజీ బామ్మ చచ్చిపోయింది. ఆవిడదెయ్యం కాకుండాచూడు. అందువల్ల మాకే భయంలేకుండా చెయ్. ఆమె సుఖంగా యీ గోతిలో నిద్రపోయేట్టు చెయ్. మా రజీ విచారాన్ని తగ్గించు."అన్నాను.

"ఇక గొయ్యి కప్పేద్దామా?" అనడిగాడు రజీ.

"చివరిసారిగా ఆమెనుచూసి నమస్కారంచేయ్." అన్నాను గంభీరంగా.

పైనకప్పిన దుప్పటితీసి నమస్కారంచేశాడు. తర్వాత చెరో పలుగూ తీసుకుని గొయ్యికప్పేశాం. అంతా కప్పేశాక అన్నాను: "ఈ స్థలంలో చెట్టు ఏదయినా పాతాలి, రజీ!"

"సాయంకాలం జామమొక్క తెచ్చి వేస్తానులే"

"సరే" అన్నాను. ఇద్దరం గుడిసెలోకి వచ్చాం. అప్పటికి బాగా అలసిపోయాం. రెండుగ్లాసుల మజ్జిగ తాగాడు వాడు.

"రాత్రి బామ్మకోసం తెచ్చినరొట్టెఉంది తెచ్చేదా?"

నాకువళ్ళు ఝల్లుమంది. "వద్దురజీ!– మీ బామ్మ దెయ్యం రొట్టెచుట్టూ తిరుగుతూంటుంది. దాన్ని కాకులకు పడేయ్"

తలూపాడు.

అప్పటికే సాయంకాలమయింది. నేను లేచాను. మరివెళ్తానురా" అన్నాను.

"నువ్వుండడంవల్ల అన్ని పనులు సరిగ్గా జరిగిపోయాయి రా. నీ స్నేహం ఎప్పుడూ మానను. నీ వుపకారం మరచిపోను" అన్నాడు రజీ.

"పర్వాలేదులే" అని గుడిసెబయటికి వచ్చేశాను.

నా కాళ్ళింకా వణుకుతూనే వున్నాయి.

"రాత్రి ఓ సారి ఇటువేపు వస్తావా?"

"మరి రాలేను యివాళ" అన్నాను నీరసంగా.

"సరేలే" అన్నాడు వాడు.

రెండడుగులు వేసి, అంతలో హఠాత్తుగా ఆగిపోయి వాణ్ని పిలిచాను.

"రాత్రి ఎక్కడుంటావ్?"

"ఈ గుడిసెలోనే! ఏం?"

"దెయ్యంవున్న యింట్లోవుంటే ప్రమాదం"

నవ్వేశాడు వాడు. "పర్వాలేదులే మా బామ్మ దెయ్యమేగా?" నన్నేం చెయ్యదు.

నేను మెల్లగా యింటికి వచ్చేశాను.

## 9

ఆ మర్నాడు నాకు బాగా జ్వరం వచ్చేసింది. కలవరింతలుకూడా ప్రారంభమయాయి. వళ్ళు సలసల కాగిపోయింది. నిద్దట్లో ఏవో దెయ్యాలూ భూతాలూ, అని అరుస్తున్నానుట-బాబాయ్ అన్నాడు. భయపడిపోయి డాక్టర్ని పిలుచుకొచ్చాడు.

నాకింకా రజీ గుడిసెలోని బామ్మ ముఖవేఁ గుర్తొస్తోంది.జ్వరం రాత్రికి మరీ ఎక్కువయింది.నాకు వంటిమీద తెలివిలేకుండా పోయింది. ఏదో అసందర్భపు పేలాపన చేస్తున్నాను.

మరోవారం రోజులవరకూ జ్వరం ఏమిటో అంతు పట్టలేదు. చివరికి టైఫాయిడ్ అని తేల్చాడు డాక్టరు. బాబాయి హడలిపోయేడు.

ఓ రోజునిర్మల నన్ను చూడడానికి వచ్చింది. బాబాయితో మా నేస్తం అని చెప్పాను. బల్లమీద కూచో! "ఎలా వుంది గోపూ!" అంది.

"బావుంది" అన్నాను.

బాబాయి ఏదో పనిమీద అవతలికి వెళ్ళేవరకూ ఆ మాటా, యీ మాటా చెప్తూ కూచుంది అతను బయటికి

వెళ్ళగానే వంగి నా చెవిలో అడిగింది. "నిజం చెప్పు— మొన్న దెయ్యంతో మాట్లాడావు కదూ?"

"ఎప్పుడు?"

"జ్వరం వచ్చిననాడు సాయంకాలం"

"అబ్బే లేదు"

"అబద్ధం చెప్తున్నావు"

"నీతోడు"

ఇంకా నమ్మకం కుదరలేదు నిర్మలకి. అసలువిషయం చెప్పేదామనుకున్నాను. కాని ఎవరితోనన్నా చెప్పేస్తుందేమోనని భయపడ్డాను.

"మరయితే జర్వం ఎందుకొచ్చింది?"

"ఏమో?"

"సాయంకాలం మళ్ళీవస్తాలే!" అనిలేచింది. "రోజా వస్తావుకదూ?" అనడిగాను. అలాగేనంది.

నిర్మల గురించి ఆలోచిస్తూ అలాగే పడుకున్నాను. ఆమె వచ్చివెళ్ళగానే ధైర్యంవచ్చింది.ఇలాపడుకుని ఉండగానే కిటికీ అవతల ఏదోదొర్లిపోయిన చప్పుడైంది. బాబాయ్ కాబోలనుకున్నాను. కాని నా ఒళ్ళో ఏదో పొట్లాం కిటికీలోంచి వచ్చి పడేసరికి తుళ్ళిపడ్డాను.పొట్లాం విప్పిచూశాను. దాకు పళ్ళగుత్తి కన్పించింది. దానికే చిన్నదారంతో కాగితంఉంది. దానిమీద వచ్చీరాని వ్రాతలో రెండక్షరాలున్నాయి. "ర...జీ...!"

"రజీ!" అనరిచాను గట్టిగా కిటికీవేపుతిరిగి.

కాని ఎవ్వరూ పలకలేదు. ఇంతలో బాబాయి లోపలికొచ్చాడు.

"ఆదాశుపళ్ళెక్కడివిరా?" అన్నాడు.

కాస్త తడబడి "నిర్మల తెచ్చియిచ్చింది" అన్నాను.

నవ్వుకుని మెల్లగా అన్నాడు బాబాయి! "నిర్మలచాలా మంచి పిల్లలాఅవుపిస్తోంది."

నేనుమాట్లాడలేదు. కళ్ళుమూసుకు పడుకుని రజీ గురించే ఆలోచిస్తున్నాను.

మరోరెండు నెలలవరకూ యీటైఫాయిడ్ తగ్గలేదు. కిష్టుడూ, కన్న, రాజీ... అందరూనన్ను చూడడానికి ఒక్కొక్కరేవచ్చిపోయేవారు. వచ్చినప్పుడల్లానాకు ఏవో పళ్ళు తెచ్చియిచ్చేవారు. వాళ్ళఅమ్మా నాన్నా అలాయివ్వ మని చెప్పిపంపేవారట. నాపనిభలే బావుంది. రకరకాల పళ్ళూ తిన్నాను.

రోజూప్రొద్దుటా సాయంకాలం నిర్మలవచ్చికూచు నేది. చీకటిపడేదాకా అన్నీమాట్లాడుకునేవాళ్ళం. నాకు జర్వంపోగానే ఏంచేస్తానో అన్నిచెప్పేవాడిని.వింటూకూర్చు నేది. ఓరోజు మా బడిపంతులుగారు కూడా మా యింటికి వచ్చారు నన్నుచూడడానికి. నన్నుముద్దుగా పలకరించాడు. అప్పటిదాకా చెడ్డవాడనుకున్నాను పంతుల్ని. ఇప్పుడతనూ మంచి వాడయిపోయేడు! ఇంకెప్పుడూ అతనిక్లాసులో అల్లరి చెయ్యకూడదనుకున్నాను.

కాని ఎప్పుడయినా రజీవస్తాడేమోనని ఎదురుచూశాను.

కాని రాలేదు. బాబాయిని చూసి భయపడిరాలేకపోతున్నా డనుకున్నాను.

రెండుమూడుసార్లు అలాగే పొట్లాంతో పళ్ళు నా మంచం మీద పడేసి పారిపోయేడు.

ఓ రోజు నిర్మల్ని అడిగాను: "ఒకరోజు మనిద్దరం బడి నుంచి వస్తూంటే ఓ సన్నటి అబ్బాయి నిన్ను అక్కడే నిలబడమని నన్ను దూరంగా తీసుకెళ్ళాడు. జ్ఞాపకం ఉందా?"

"అవునవును. వుంది."

"ఆ అబ్బాయి నీకెప్పుడయినా కన్పిస్తూంటాడా?"

నా స్నేహితులందరిలోనూ నిర్మల ఒక్కతే రజీని చూసింది. అందుకని అడిగాను.

"రోజూ చూస్తూంటాను" అంది.

"రోజూ కన్పిస్తాడా"

"నేను స్కూలునుంచి వచ్చేదారిలో రోజూనిలబడతాడు. నీకెలావుందని అడిగిపోతూంటాడు ఏం?"

"నేనూ మాట్లాడలేకపోయాను. ఎంతోసేపటికి "రజీ చాలామంచివాడు" అన్నాను.

నిర్మల మాట్లాడలేదు.

"ఈసారి కన్పిస్తే నేను రమ్మన్నానని చెప్పు. తప్పకుండా రావాలని చెప్పు" అన్నాను.

అలాగే నంది.

నాకు భలే గమ్మత్తయిన ఆలోచనతోచింది. మామూలుగా రమ్మంటే రాడని తెల్సు. అంచేత నిర్మల రెండు

చేతులూ పట్టుకుని చెప్పాను. "నిర్మలా! బాగా జ్ఞాపకం ఉంచుకో నేను చెప్పినమాటలు— 'గోపూ చచ్చిపోతు న్నాడు. ఇవాళరాత్రే చచ్చిపోతాడు. తన ఉడతబోక, ఊత బెత్తం, రంగురాళ్ళూ—యిదివరకు గోళీలు దాచిన చోటే ఉన్నాయి-అవన్నీ తీసుకోమను.తనుచేసినతప్పులన్నీ క్షమించా నని చెప్పు. ఈరాత్రి కావలిస్తే మాట్లాడతానని చెప్పు."

నిర్మల ఏడుపుమొహంపెట్టి "నిజంగాచచ్చిపోతావా గోపూ!"అంది.

"అబ్బే! ఉత్తుత్తి మాటలన్నీను. అలాఅంటేనే కాని రజీ యిక్కడికిరాడు"

"అయితే నిజంగా చచ్చిపోవా!"

"ఊహుఁ మరివాడితో చెప్తావా!"

"అలాగే"

ఆనాడు చీకటిపడ్డదగ్గర్నుంచి వాడికోసమే చూస్తు న్నాను. ఇప్పుడు నా అంతటనేను కూర్చోగలుగుతున్నాను. జర్వం పూర్తిగా తగ్గిపోయింది.

బాబాయి భోజనంచేసి నాకు పాలుయిచ్చాడు. నేను తాగుతున్న సమయంలో గుమ్మందగ్గర అలికిడయింది. రజీ చీకటిలో దొంగలా నిలబడ్డాడు.

"ఎవరది?" అనరిచాడు బాబాయి.

"నే నండి"

"నేనంటే?"

"రజీనండి"

"లోపలికిరా" అన్నాను భలే సంతోషంగా.

మెల్లగా గుమ్మందాటి లోపలికి అడుగుపెట్టాడువాడు. వాణ్ని చూడగానే పోల్చేశాడు బాబాయి.

"నువ్వాసాడు మా వాణ్ని కొట్టావుకదూ?"

"మ రెప్పుడూ కొట్టనండి"-అని లెంపలు వేసుకున్నాడు భయపడుతూ.

"మరిప్పుడెందుకొచ్చావ్?"

"ఊరికేనే చూసిపోదామని"

"సరే. దూరంనుంచి చూసిపో"

"అలాగేనండి." అని అక్కడేనేలమీద కూర్చుండి పోయేడు రజీ.

బాబాయి హుక్కాపీల్చడానికి వీధి గుమ్మంలోకి వెళ్ళిపోయేడు.

"పర్వాలేదు. దగ్గరికిరా" అని గొణిగాను.

పాకుతూ నామంచందగ్గరికివచ్చాడు.

"ఎలావుందిరా నీకు?"

"బాగాతగ్గిపోయిందిలే యిప్పుడు"

"లేచి నడుస్తున్నావా?"

"మరోరెండురోజుల్లో నీతో సరిగ్గా పరిగెత్త గలను. పదెం" నవ్వేడు వాడు. లాగూలోంచి పొట్లం తీశాడు.

"దానిమ్మపండు నీ కిష్టమేనా?"

"ఓ. ఎక్కడిదీ?"

"లోయతోటలోంచి తీసుకొచ్చాను. బాగా పండిం దిలే. నీకోసమని దాచివుంచాను." తీసిబల్లమీద పెట్టాడు.

"మళ్ళీ నువ్వు అక్కడికి వెళ్తున్నావా?"

"అక్కడే ఉంటున్నాను"

"మరి గుడిసెలోనో?"

"సామాన్లన్నీ తోటలో పడేసుకున్నాను. గుడిసెకి తాళం వేసేశాను.

"ఒక్కడికీ రాత్రి భయంవెయ్యడంలా?"

"నీ అంతభయం నాకులేదురా"

నేను సిగ్గుపడ్డాను.

"మాటి మాటికీ యిలా జ్వరంవస్తే చచ్చిపోనూ!"

"నిజంగానే నేనానాడు భయపడలేదు." అన్నాను గట్టిగా.

"సరేలే ఆవిషయం ఎందుకు?"

నేనేమీ మాట్లాడలేదు. కొంతసేపయాక "నేనూ బడిలో చేరాలనుకుంటున్నాను." అన్నాడు.

"నిజంగా!"

"అవును. నిజంగానే"

"తప్పకుండాచేరు రజీ!- నా పుస్తకాలునీకుయిస్తాను. నా రెండో పలక నీకిచ్చేస్తాను. చక్కగా యిద్దరం బడికి వెళ్ళి రావచ్చు, ఏం?"

"అలాగే నువ్వెప్పట్నుంచీ బడికివస్తావ్?"

"రేపట్నుంచీ వచ్చేసేదా?"

"అప్పుడేవద్దు"

"అయితే నేను వచ్చేసేదాకా బడిలో చేరకు"

"అలాగేలే. మరి వెళ్ళేదా?"

"అప్పుడే. కాస్సేపుకూచో."

"పడవమీాద అవతలలి ఒడ్డుకు వెళ్ళాలి. చాలాఆలశ్య మయిపోతుంది—పోతుంది. ఆకలి వేస్తోంది."

పడవఅనేసరికి నాకుభయంవేసింది. "సరేవెళ్ళిరా" అన్నాను.

"మళ్ళీవస్తావా ఎప్పుడయినా?"

"అలాగే" అంటూ లాగుపైకి లాక్కొని పారిపో యేడు రజీ.

# 10

ఇప్పుడునేను పూర్తిగా తేరుకున్నాను. లేచి తిరగ గలుగుతున్నాను. ఇంక ఆలస్యంచెయ్యకుండా మర్నాడే బడికి వచ్చేశాను. ఆనాడు క్లాసులో నిర్మలప్రక్కనేకూచొ న్నాను. ఎన్నో కబుర్లుచెప్పింది నిర్మల.

సాయంకాలం రజీకోసం పడవదగ్గరికివెళ్ళాను. రజీ కన్పించాడు.

"ఇవాళబడికి వెళ్ళానురా" అన్నాను.

"మరినేనూ చేరిపోయేదా?"

"నీకు డబ్బెక్కడిదీ"

"రా చూపిస్తాను"

"నేనూ వాడివెనకనడిచాను. ఇద్దరం వాళ్ళగుడిసె లోకి వచ్చాం"

"తలుపు తీసెయ్" అన్నాడు. ఆగదిలో ఓమూల గొయ్యితవ్వాడు. బాగా తవ్వాక ఓచిన్నపెట్టెపయికి తీశాడు. ఏదో మాయలాగ ఆశ్చర్యంతో యిదంతా చూస్తూ నిలబడ్డాను.

ఆపెట్టెలో వెండిరూపాయలున్నాయి. ఒకటీ, రెండూ అని యిరవైఅయిదు రూపాయల్ని లెక్కపెట్టాడువాడు.

"ఎక్కడిదిరా యింతడబ్బు?"

"మాబామ్మనాకోసందాచింది. రేపు చచ్చిపోతుందనగా నా చెవిలో యీ రహస్యం చెప్పింది. ఈ డబ్బు చాలదూ?"

"సరిపోతుంది"

పెట్టె లోపల ఉంచేసి మట్టితో గోతిని కప్పేశాడురజీ. లేచి చేతులుదులుపుకొంటూ "పద" అన్నాడు.

"ఏతరగతిలో చేరుతావు?"

"అయిదు"

"అయితే నేను కిందటి సంవత్సరం చదివిన పుస్తకాలన్నీ నీకిచ్చేస్తాను. మరెప్పుడు చేరుతావ్?"

"రేపు చేరేదా!"

"అలాగే"

తర్వాత నేనింటికి వచ్చేశాను.

మర్నాడు రజీ బడిలో చేరేడు. నాస్నేహితులందర్నీ వాడికి పరిచయం చేసేశాను. సాయంకాలమయేసర్కి అందరం ఆటలు ప్రారంభించేవాళ్లం. రజీకి రకరకాల ఆటలు తెలుసు.

ఓనాడు అందరూ కలిసి లోయలోకి బయల్దేరాం పడవమీద. ఆనాడు స్కూలు శెలవుకావడంవల్లపొద్దుటే వెళ్ళిపోయాం. చెట్లుమరీ దట్టంగా ఉండడంవల్ల పైనఎండగా వున్నా అక్కడంతా నీడగావుంది చల్లగాలి వీస్తోంది.మామిడి కాయలు, చింతకాయలూ కావల్సినవి తిన్నాం.రోజంతా రకరకాల ఆటలు ఆడాం. అందరికీ రజీఅంటే మంచినమ్మకం ఏర్పడిపోయింది. ఇప్పుడు వాడేంతచెప్తే అంత.

రోజూ మా క్లాసు అయిపోయేవరకూ మాగదిముందు నిలబడేవాడు రజీ. అయిపోయాక, నేనూ వాడూ, నిర్మలా కలిసి యింటికి వచ్చేసేవాళ్ళం. దారిలో నాకంటెహెచ్చు కబుర్లు చెప్తూండేవాడు. నవ్విస్తూండేవాడు. ఓ రోజు మా యిద్దరికీ సీమచింతకాయలు కొనిచ్చాడు.మైదానంలో రెండు పిల్లిగెంతులువేసి మాకు చూపించాడు. సినీమాల్లో దొంగలు ఎలా కళ్ళకుగుడ్డలుకట్టుకొని యుద్ధం చేస్తారో చూపాడు, లేడి వెనకాళ్ళతో ఎలాగెంతుతుందో చెప్పాడు, కుక్కఅరుపు అరిచాడు... అన్ని కొక్కిరాయి వేషాలూ వేశాడు.

ఓరోజు నిర్మలకి ఓ ఎర్రరిబ్బను తెచ్చియిచ్చాడు. మర్నాడు రెండు చెంపపిన్నులిచ్చాడు. నాలాగే సరదాగా మాట్లాడుతుండేదివాడితో కూడాను. ఇదంతా చూశాను. నిర్మల నాతోతప్ప యింకెవరితోనూ అలానవ్వుతూ మాట్లాడడం నా కిష్టంలేదు.అందుచేత ఓరోజు రజీ లేకుండాఉన్నప్పు నిర్మలని అడిగాను.

"నిర్మలా, ఒకటి అడుగుతాను చెప్తావా?"

"ఏమిటో అడుగు" అన్నది రెండుజడలూ ముందుకి లాక్కుంటూ.

"సిగ్గుపడకుండా చెప్పాలి"

"అల్లవేళ కాగితాల్లాంటి వైతే ఒద్దు"

"అలాంటివి కావులే"

"మరయితే అడుగు"

"నే నంటే నీ కిష్టమేనా?"

రెండుచేతుల్తో ముఖం కప్పేసుకుంది నిర్మల.

"మరి చెప్పాలి?"

"నే చెప్పను."

"అయితే మరి నీ జట్టు విప్పేస్తాను."

ఆశ్చర్యంగా చూసింది నిర్మల. వెనక్కి-తిరిగికూచొంది. నేలమీాద వేలితో ఏదో రాసింది.

ఆమె వెనక నే నిలబడి చదివాను:"నువ్వంటే నా కెంతో యిష్టం"

నేను చదవగానే చెరిపేసి మొకాళ్ళమధ్య తలదాచుకుంది.

"మరెప్పుడూ యిలాంటివి అడక్కు"

"అలాగే.నువ్వు రజీతో ఎందుకలామాట్లాడతావ్?"

"ఎలామాట్లాడాను?"

"నవ్వుతూ, కేరింతాలు కొడుతూ"

"మాట్లాడకూడదా?"

"అంటే అలాకాదు. పెద్దదానిలాగమాట్లాడాలి"

"అలామాట్లాడితే తప్పా?"

"ఓవిధంగా తప్పే. మరి నేనంటే నీకిష్టంకదూ?-అందు చేత యింకోరితో స్నేహం మానేయాలి"

కొంతసేపాలోచించి "సరే" అంది.

తర్వాత యిద్దరం యింటికి వచ్చేశాం.

మర్నాడు, అటుమర్నాడు, రజీ నిర్మలతో చనువుగా చనువుగా మాట్లాడం మానలేదు. నిర్మలమాత్రం అతనితో మాట్లాడ్డం మానేసింది. ఎటు నేపోచూస్తూ వెళ్ళిపోయేది. మర్నాడు సాయంకాలంనాదగ్గరికివచ్చి "ఇలాగేనాఉండాలి?" అనడిగింది.

"అవునిలాగే" అన్నాను.

రజీలో చాలామార్పువచ్చింది. నిర్మలసరిగ్గా మాట్లాడకపోవడం చూసి తెల్లబోయేడు. ఎవరితో మాట్లాడకుండా యింటికిపోయి వస్తూండేవాడు.

నాకెన్నోవిధాల సహాయంచేసిన రజీ యిలా అయి పోవడం నాకుయిష్టంలేదు. అతనికి సంతోషం కల్గించాలి. నాకు ఆ తర్వాత ఎన్నో గోళీలూ,గాలిపటాలూ యిచ్చాడు. అలాంటి రజీవిచారం పోగొట్టాలి అనుకున్నాను. ఓరోజు రజీతో యీ విషయం మాట్లాడాను.

"నువ్వెందుకు బడిలో చేరావో నాకు తెల్సులే!"

రజీ ఆశ్చర్యపోయేడు. "ఎందుకూ?"

"నిర్మలతో స్నేహం చెయ్యడంకోసం. అవునా?"

"కాదు"

"ప్రమాణపూర్తిగా చెప్పు"

"అవును"

"మరినాకు మొదటే చెప్పలేదేం?"

"ఇప్పుడేం?"

"నిర్మల నిన్ను యిష్టపడదు"

"ఏం?"

"ఇదివరకే నేనంటేయిష్టం"

"నాకు తెలీదే!"

"తెలిస్తే ఏం చేసేవాడివి?"

"బడిలో చేరేవాణ్ని కాదు."

"మరిప్పుడేం చేస్తావ్?"

"బడిమానేస్తాను"

"వద్దురజీ. నువ్వు బడిమానెయ్యకు. నిర్మల నీతో మాట్లాడేటట్టునే చేస్తాగా-నా మాటవిను" అని బతిమాలాను.

సరే నన్నాడు.

రజీబడిలో ఉండడానికి ఏమైనా చెయ్యాలనుకున్నాను. మర్నాడు నిర్మలతో మాట్లాడాను.

"నువ్వు యికనుంచీ నన్ను ప్రేమించకూడదు"

"ప్రేమించడం అంటే?"

ఇదివో పుస్తకంలో చదివిన మాట. నిజానికి దాని అర్థం పూర్తిగా నాకూ తెలీదు. పెద్ద పెద్దవాళ్ళూ, సినిమా వాళ్లూ, ప్రేమించుకుంటారట.

"ప్రేమించడమంటే ప్రేమించడమే!-దానికి అర్థం ఉండదు"

"అయితే నిన్నే ప్రేమించాన్నేను?"

"నేనంటేయిష్టపడటమే ప్రేమించడమన్నమాట. నేను

చేసిన పనుల్ని మెచ్చుకుంటూ నేను మాట్లాడినవన్నీ వింటూ, నాతో కలిసి తిరగడమంతా ఒక్క-మాటలో ప్రేమించడమం టారు. మరిప్పుడ్నుంచీ నన్ను ప్రేమించకు"

"మరేంచేసేది?"

"రజీ తెల్సా?"

"ఓ"

"అతన్ని ప్రేమించు"

"అతనన్నీ కొక్కిరాయిపనులుచేస్తాడు. అతనంటే నాకిష్టంలేదు."

"అలా అనకూడదు. ఆపనులన్నిటినీ నువ్వు మెచ్చుకోవాలి."

"అతనిమాటలూ నాకు నచ్చవు"

"నచ్చకపోయినా వినాలి"

"వినను"

"నామాటవిను నిర్మలా-ప్లీజ్‌నీకోన్నాళ్ళు ప్రేమించు"

"ఆ తర్వాత?"

మళ్ళీ నన్నే ప్రేమిద్దువుగాని"

"నే నెవర్నీ ప్రేమించనుగోపూ!-నిన్నే ప్రేమిస్తాను" అని పట్టుబట్టింది. నాకు చికాకేసింది. రజీకోసం నేనుచేసిన పనులన్నీ పాడయిపోయేయి.

"నీతోమాట్లాడను పో" అనేసి వచ్చేశాను నేను.

ఏడుస్తూయింటికిపోయింది నిర్మల.

ఆమర్నాడే రజీతో చెప్పేశాను.

"నిన్ను నిర్మలప్రేమించలేదట!-నువ్వింకబడిమానెయ్.

నేనుకూడా ఆ అమ్మాయితో మాట్లాడడం మానేశాను''
అన్నాను.

సరేనన్నాడు రజీ.

# 11

మరి బడికి రాలేదు రజీ. నేను నిర్మలతో మాట్లాడం
కూడా మానేశాను.

రోజులిలా గడిచిపోతున్నాయి.

ఓ రోజు రజీ నాదగరికి పరుగెత్తుకొచ్చాడు. "నిజం
ఏనుగు చూస్తావేమిట్రా?"

"ఎక్కడుంది?"

"నేను చూపిస్తానురా. పులీ, సింహంకూడాఉన్నాయి"

నాకిక ఆశ్చర్యం తగ్గలేదు ''అయితే పద'' అని పరి
గెత్తాను.

''అన్నిట్లోకీకోతి బావుందిరా. మనం ఏంచేస్తే అది
చేస్తుంది.''

"ఎక్కడుంది?"

చూపిస్తానుగా - నల్లగా పెద్ద ఎలుగుబంటికూడా
ఉంది."

ఇద్దరం మైదానంమీదకి వచ్చాం. అప్పటికే అక్కడ
పెద్ద గుడారాలు వేసేశారు.

"ఇవన్నీ ఎప్పుడు వేశారు?" అన్నాను ఆశ్చర్యపోతూ.

''రాత్రి నేను పడవదగ్గరికి వెళ్ళిపోతూంటే సింహాగర్జన
విన్పించింది. ఏమిటా-అని యిటు వేపు వచ్చాను చూస్తే ఈ

జంతువులన్నీ వున్నాయి. వాళ్ళంతా యివన్నీ కడుతున్నారు. అప్పట్నుంచీ యిక్కడే కూచున్నాను."

"అయితే రాత్రి యింటికి వెళ్ళలేదా?"

"ఊహుఁ"

అన్ని జంతువుల్నీ చూశాం. నిజం జంతువుల్ని ఎప్పుడూ చూడలేదు నేను. చాలా బావున్నాయి. నాకూ అన్నిటిలోకీ కోతే నచ్చింది.

"రాత్రి వస్తావా? సర్కసు చూద్దాం?"

"మరి టిక్కెట్లో?"

"అక్కర్లేదులే. నే చెబుతాగా?"

"అంటే ఏంచేస్తావ్?"

"ఇప్పుడు చెప్పను. రాత్రి భోజనంచేసి వచ్చేయ్. నే నిక్కడే ఉంటాను."

"ఇక్కడేంచేస్తావ్?"

"ఇవన్నీ కట్టడం చూస్తూంటాను. రాత్రి రెండుజాము పళ్ళు పెట్టాను కోతికి. నాకప్పుడే మచ్చిక అయిపోయింది. కావలిస్తే చూడు"—అని కోతిఉన్న బోనుదగ్గరికి వెళ్ళి కిచకిచ మని అరిచాడు, కోతి రెండు గెంతులుగెంతి వెనక్కి తిరిగి తోక బయటికి పెట్టింది.

"చూశావా?" రజీ అన్నాడు ఉత్సాహంగా.

"భలేబాగుంది. మరి నాకూ మచ్చిక అవుతుందా?"

"అందరికీ అవదు. నీదగ్గరేమన్నా ఉన్నాయా?"

"గోళీలు రెండున్నాయి,"

"ఛస్! అవికాదురా, దానికి తినడానికియ్యడానికి?"

"ఏవీలేవు"

"అయితే వెళ్ళి తీసుకురా"

"అలాగే. నేనివాళ బడిమానేస్తాను."

"నీయిష్టం"

ఆ రోజంతా అక్కడే కూర్చుండిపోయాం యిద్దరం.

సాయంకాలం సర్కసు మొదలుపెట్టే వేళకి వెనక వేపువెళ్ళి, గుడారం కిందనుంచి దూరిపోయాం. ఎవ్వరూ చూడకుండా ముందుకొచ్చి కూచున్నాం.

సర్కసు ప్రారంభించారు. తమాషా మొగ్గలూ, పిల్లి గెంతులూ వేశారు. కోతి చిన్న బండీని యీడుస్తూ పరుగెత్తడం అన్నిటికన్నా చాలా బావుంది. గుర్రాలూ, ఏనుగులూ రకరకాల పనులన్నీ చేశాయి. ముఖ్యంగా హాస్యగాడు చేసిన పనులు నాకూ, రజీకి, యింకా నచ్చాయి. పులీ సింహాన్నితో లుపటకాతో శొడుతూంటేఅరవడంఎంతో బావుంది.

ఆటంతా అయిపోయాక యింటికివస్తూ రజీతో అన్నాను:

"మనం హాస్యగాళ్ళం అయిపోదామేమిటి?"

"ఎలాగ?"

"ఆ సర్కసువాళ్ళని అడుగుదాం?"

"ఏమని?"

"మనల్నికూడా వాళ్ళలో చేర్చుకోమని."

"మనకలా గెంతడం రాదుగా?"

"నేను కొన్నిరకాల మొగ్గలు వెయ్యగలను. నీకూ కొన్ని అరుపులూ, అవీ వచ్చు. మిగతావి వాళ్ళు నేర్పుతారు."

అమర్నాడు యిద్దరం వెళ్ళి సర్కసు యజమానిని అడిగాము మమ్మల్నికూడా చేర్చుకోమని.ఒక్కసారిమమ్మల్ని జాగ్రత్తగాచూసి కసిరేసి పొమ్మన్నాడు.

విచారంగా యింటికొచ్చేశాం. నాకు ఏడుపొచ్చింది.

"మేనేజరు ఎందుకు పొమ్మన్నాడంటావ్ ?"

"మనం చిన్నవాళ్ళం. అంచేత వద్దన్నాడు."

నాకో చిన్న ఆలోచన తోచింది. చటుక్కున రజీవేపు తిరిగి అన్నాను."మనమే హాస్యగాళ్ళ వేషం వేసుకుని సర్కసు ఆట ఆడదామా?"

"ఎలా?"

"తోలుముక్కలు జోళ్ళకుట్టేషాపులో దొరుకుతాయి. కర్రలకి చుడితే కొరడాలు తయారవుతాయి. గోపీ. కిష్టుడూ అంతా పులులూ, సింహాలూ అనుకుందాం.ఇంకేం!— ఆట బావుంటుంది."

"రైట్, ఎప్పుడు ఆడుదాం?"

"రేపు అందరం లోయతోటలోకి పోదాం. అందరినీ నేను పిలుస్తాలే. ఇవాళరాత్రి అంతా కలిసి మరోసారి సర్కసు చూసేద్దాం. రేపు హాయిగా ఆడుకోవచ్చు. ఏం!"

"అలాగే"

రాత్రి మళ్ళీ సర్కసు చూశాం. ఈసారి సింహాల్ని ఆడించే రింగుమాష్టరుమీదికి పోయింది నా దృష్టి. మర్నాడు అంతా తోటలోకి చేరిపోయాం. సాయంకాలంవరకూ రకరకాల ఆటలు ఆడాం. నేను రింగుమాష్టరు వేషం వేశాను. రజీ హాస్యగాడు వేషం కట్టాడు. వంటినిండా సున్నపుబొట్లు

పెట్టుకొని అన్నీ కొక్కిరాయిపనులూచేశాడు. అందరికన్నా చిన్నవాడు కన్నా చేత కోతిఆట ఆడించాం. రాజీ, కిష్టుడూ మిగతా వాళ్ళంతా సింహాలూ. పులులూను. తోటంతా సర్కసు చూసే వాళ్ళన్నమాట.

"హాయ్! పులిని బోనులోంచి తీసుకొస్తాను చూడండీ—?పులి చాలా క్రూరమయిన జంతువండీ!-జాగ్రత్తగా ఉండకపోతే మీకేప్రమాదం. కమాన్ టైగర్!" అని అరిచాను.రాజీ పులిలాగ గాండ్రుగాండ్రుమంటూవచ్చాడు. కాని ఆ ఉత్సాహంలో నిజంగానే తోలు కమ్చీతో చెళ్ళుమని రెండుమూడు దెబ్బలు కొట్టేశాను అనుకోకుండానే. అక్కడితో వాడుగొల్లుమని ఏడుస్తూ కూచున్నాడు. కోతి ఆటకోసం చెట్టెక్కిన కన్నా కాలు జారి క్రిందపడిపోయేడు. వాడికాలు బెణికిపోయింది.రజీ కాలులో ముల్లువిరిగిపోయింది.

"ఇవాళ మంచిరోజు కాదురా.అందరకూ దెబ్బలు తగిలాయి" అన్నాడు రజీ,

"అసలు సర్కసుఆట మంచిఆటకాదు"అన్నానునేను.

అదినిజమన్నారు అంతాను. మరెప్పుడూ ఆ ఆట ఆడకూడదనుకున్నాం.తర్వాత ఎవరిళ్ళకు వాళ్ళు వెళ్ళిపోయారు.

ఆట అయిపోయిందే కాని మా రజీకి వేషంవెయ్యాలన్నా సరదాపోలేదు. నేనుమాత్రం రింగుమేష్టరివేషం మర్చిపోయేను.

మరి పది పదిహేను రోజులవరకూ ఎటువంటి అలజడీ లేకుండాగడిపేశాం.సర్కసు మా ఊరునుంచి వెళ్ళిపోయింది. కాని అక్కడ ఉన్నప్పుడే ఓకోతి ఏనుగుకాలికిందపడి చచ్చి

పోయింది. కాలికిందపడి క్రీచ్క్రీచుమని అరవడం రజీ స్వయంగా చూశాడట. నన్నుకూడా కోతి శవాన్ని చూడడానికి తీసు కెళ్ళాడు. సర్కసు యజమానిని ఆకోతి శవంకావాలని అడి గాడు. ఒక్కసారి మా యిద్దర్నీచూసి మొహంమీద పారే శాడు. ఇక మాసంతోషం చెప్పతరంకాదు. దాన్ని పట్టు కుని పడవదగ్గరవరకూ పరిగెత్తాం.

ఆయాసం తగ్గాక మెల్లిగా అడిగాను:"ఆ కోతిని ఏం చేస్తావు రజీ?"

"నీకింకా తెలీదూ?-కోతిఎక్కడుంటే అక్కడఅదృష్టం వస్తుంది?"

"అయితే లోయతోటలో దీన్ని ఉంచుదామా?"

"అవును. అక్కడే ఉంచాలి"

ఇద్దరూ దాన్ని ఓకొయ్యపెట్టెలో పెట్టి చెట్టుతొర్రలో చుట్టూ కొమ్మలూ, ఎండుటాకులూ కప్పాం.

"చూడు నేనిప్పుడే చెప్తున్నాను. అదృష్టం మనకి వచ్చి తీరుతుంది." అన్నాడు రజీ.

పదిరోజులయినా ఏమీ అదృష్టం రాకపోవడంతో మాకు విసుగెత్తింది. ఓ రోజున కోతిని భూస్థాపితంచేసెయ్యా లని రజీతో చెప్పదల్చాను. పడవమీద అవతలి ఒడ్డుకి బయల్దేరాను. ఏడిఅలికిడి ఎక్కడా విన్పించలేదు. "రజీ" అని అరిచాను. కొండలమీద ఆ అరుపు ప్రతిధ్వనించింది. గంట సేపటివరకూ అలా అరిచిఉంటాను. కాని వాడు పలకలేదు. మరోగంట అక్కడే కూర్చుండిపోయాను. చీకటిపడినాకదల్లేదు. ఇంతలో నాకోవిషయం జ్ఞాపకంవచ్చింది. ఆప్రాంతాల్లో పులి

తిరుగుతోందట. మాబాబాయి చెప్పాడు. నన్నటువేపు వెళ్ళొద్ద న్నాడుకూడాను. అది జ్ఞాపకం రావడంతోనే రజీని పులితినేసిం దేమోనని భయంవేసింది. గట్టిగా ఏడ్చేశాను.

హఠాత్తుగా చిన్న ఆలోచన తట్టింది. కోతిని గోతిలో పడెయ్యడానికి వెళ్ళాడేమో? వెంటనే చెట్టుదగ్గిరికి పరిగె త్తాను. కోతి అక్కడేవుంది. కాని జాగ్రత్తగా చూస్తే దాని చేతుల్లో ఓ కాగితం కన్పించింది. తీసుకుని చదివాను. రజీ వ్రాశాడు దాన్ని:

"ఎక్కడికో వెళ్తున్నాను. నాటకం కంపెనీలో చేరి పోతాను. మళ్ళీ తిరిగి వచ్చేవరకూ నావస్తువులన్నీ నీవే. నా నల్లగోళీలూ, కర్రపెట్టీ నువ్వే తీసుకో"-రజీ.

నాకిప్పటికి ఏడుపుతగ్గింది. రజీ చచ్చిపోలేదని తెల్సింది. వాడు వెళ్ళిపోవడం బాధపెట్టినా వాడివస్తువులన్నీ నాకిచ్చే య్యడంవల్ల సంతోషం కలిగింది. వాడిగురించే ఆలోచిస్తూ పడవయెక్కి యింటికి వచ్చేశాను.

మర్నాడు అక్కడికివెళ్ళి ఆ వస్తువులన్నీ తెచ్చేసు కున్నాను. కోతినిమాత్రం తీసుకురాలేకపోయేను. ఎందుకంటే- దాన్ని చూస్తే బాబాయి ఏమంటాడోనన్న భయంవేసింది. అందుచేతికోతినిమాత్రం పెట్టిలో ఉంచి తెచ్చుకున్నాను!

కోతి అంతావుంటే హెచ్చు అదృష్టం వత్చేట్టయితే, మరి కోతి చెయ్యిఉన్నప్పుడు కొంతయినా రాదా అని నాఆలోచన! —

# 12

శ్రీరామనవమి వచ్చింది.

విజయనగరంలో పండుగ బాగా జరుగుతుందని మా నాన్న అనేవాడు. నాకు సరీగ్గా అయిదేళ్ళుండగా నాన్న చచ్చిపోయాడు. తర్వాత బాబాయిదగ్గరికి వచ్చేశాను. అప్పట్లో నాకో అమ్మమ్మ ఉండేది. సంబరాలు చూడడానికి అక్కడికి వెళ్తుండేవాడిని.ఆమె ఎప్పుడు చచ్చిపోయిందో సరిగా గుర్తు లేదు.

ఈసారిగూడా వెళ్దామని అల్లరిపెట్టాను బాబాయితో. ఏమనుఖాన ఉన్నాడోగాని సరే నన్నాడు. నేను పొంగిపోయాను. కిష్టుడూ, రాజీ అందరికీ చెప్పేశాను నేను వెళ్తున్న సంగతి. అందరూ నన్ను రైలుకి దిగబెట్టడానికి వస్తామన్నారు. రైలుకి వెళ్ళేప్పుడు, ఎర్రటోపీ ఒకటి సంపాయించాను. ఎర్ర జండా,పచ్చజండాకట్టాను.గార్డు వూదేవిజిలులాంటిదేనాదగ్గరా ఒకటి ఉంది. అందరు స్నేహితులూ రైలుకివచ్చారు. స్టేషను దాటిపోయేవరకూ చేతులు వూపుతూనే ఉన్నారు.

వాళ్ళు కన్పించడం మానేశాక కిటికీ దగ్గరికివచ్చి కూచొన్నాను ఎదురుగ్గా నల్లటి కొండలున్నాయి. వాటి వెనక ఎర్రటి సూర్యుడు కన్పిస్తున్నాడు. రెండు నల్లటి మేఘాలు దూరంగా వున్నాయి. పావురాలు బారుగా విడి పోతున్నాయి. పొలాలమీద నల్లావు, తెల్లావు తోక ఆడిస్తూ గడ్డిమేస్తున్నాయి. చిన్నదూడ పాలుతాగుతోంది నల్లావు పొదుగులో. కాకులు రెండు చెట్టుమీద వాలాయి. కాక్క

ఒహాటి మెడఎత్తి మొరుగుతోంది—అంతా విచిత్రంగా కన్పిం చింది నాకు. చెట్లు వెనక్కి నడిచి పోతున్నాయి. చూస్తూ చూస్తూనే నాకు తెలీకుండా నిద్రపోయేను. మళ్ళీ బాబాయి లేపితేనే కాని తెలివిరాలేదు. లేచేసరికి ఊరికి వచ్చేశాం. రైల్లోంచి గెంతు గెంతి దిగిపోయేను.

ఆ నాలుగురోజులూ రాత్రిపగలూ అన్నమాట లేకుండా బాబాయి నన్ను తిప్పాడు. మరీ వేషాలు కన్పించని చోట భుజంమీద ఎక్కించుకుని చూపించాడు. రకరకాల వేషాలు చూశాను. చాలా బావున్నయ్. ఓ చోట డాన్సుకూడా చూశాను. మరోచోట పెద్దబోర్డుకట్టారు. నాకునోరు తిరగని పేరు దానిమీద వ్రాసిఉంది.

"ఆనాటకం చూడడానికి వెళ్దాం బాబాయ్" అన్నాను మెల్లగా.

"వద్దురా. చాలా ఆలశ్యమయిపోతుంది యింటికెళ్ళే సరికి" అన్నాడు. నేనుపట్టువిడవలేదు ఆలైట్లూ, రంగులూనన్ను బాగా ఆకర్షించాయి. వెళ్తేనేకాని వీల్లేదన్నాను. చివరికి యిద్దరంలోపలికివచ్చాము. బలేగమ్మత్తుగా ఉందిలోపల. జనంతోఆగదంతా నిండిపోయింది. మాకుఎదుట పెద్ద తెరలు వేలాడుతున్నాయి. లోపల ఏంజరుగుతోందో చూడాలనిపిం చింది. బాబాయి చుట్ట కాల్చుకుని చిన్నకునుకు తీస్తున్నాడు. ఇంతలో ఆయన్ని నేను తప్పించుకుని కుర్చీల మధ్యనుంచి దూరుతూ తెరల దగ్గరికి వచ్చేశాను. ఎవ్వరూ చూడకుండా లోపలికిదూరిపోయేను.

లోపలంతా సందడిగావుంది. సగంరంగులు వేసు

కోన్న వాళ్లూ, పంచెల్తో, చొక్కాల్తో, గదల్తో భీముడూ, ఆంజనేయుడు మూర్తిలో ఉన్న వాళ్ళూ రకరకాల మనుషులున్నారు. అందర్నీ చూస్తూ ఓ మూలకి నిలబడ్డాను. కొంతసేపటికి ఎవరో గణగణమని గంటకొట్టేశారు—పెద్దహారతి వెలిగించి పాటలు పాడేరు. దభీమని కొబ్బరికాయపగలగొట్టి ప్రక్కన పడేశారు. ఎవ్వరూచూడకుండా దాన్ని అందుకుని ఓ మూలనపలహారం చేస్తూకూర్చున్నాను.

నాటకం ప్రారంభమయిన గంటవరకూ మేలుకొని కూర్చున్నాను. తర్వాత నాకు తెలీకుండానే నిద్రపట్టేసింది. అలా ఆమూలనే ఎంతసేపు నిద్రపోయానో నాకే తెలీదు.

కాస్సేపటికి "ఎవడ్రానువ్వు?—ఇక్కడ పడుకున్నావ్?—బయటికి ఫో దొంగవెధవా!" అని అంటూ నెత్తిమీద ఎవరో రంగున మొట్టికాయ పెట్టేవరకూ తెలివిరాలేదు. అంత నిద్దట్లోనూ తల జివ్వుమంది. కొట్టినవాడిమీద వళ్ళుమండిపోయింది. వెంటనేలేచి కూచున్నాను. ఎదురుగ్గాఉన్న వాణ్ణి చూసేసరికి ఆశ్చర్యపోయేను. ఎవరో కుర్రాడు వంటినిండా రంగువేసుకున్నాడు, తలకి కిరీటం. పూలదండలూ, పసుపు రంగు సిల్కుపంచె, పువ్వులబాణం, పట్టుకొని వున్నాడు. వేషం ఎంతో బావుంది. ఇది చూస్తూంటే నాకోపం మరచిపోయేను.

"ఎవరండీ మీరు?" అన్నాను అబ్బాయితో.

"అన్నానో లేదో "గోపూ" అని గావు కేకపెట్టాడు ఆకుర్రాడు. నేను మొదట తెల్లబోయేను. నానిద్దరంతా పోయింది. వాణ్ణి జాగ్రత్తగా చూసేను. చూస్తూనే వాణ్ణి

కౌగలించుకుని. "రజీ" అని అరిచాను. అప్పటికింకా నాటకం అవుతోంది. మేం ఎన్నో విషయాలు మాట్లాడుకొంటూ కూచున్నాం. "ఇక్కడికెలా వచ్చావ్?" అనడిగాను. అక్కడితో వాడు చెప్పడం ప్రారంభించాడు. మొదట ఎన్నో మార్లు తిరిగాడుట. కన్పించిన ప్రతివాడినీ తనకి నాటకంలో వేషం యిమ్మని బ్రతిమాలేడుట. కొన్ని రోజులు తిండిలేక తిరిగాడుట. చివరికి యీ నాటకం కంపెనీ మేనేజరు దయ తలచి యీ వేషం యిచ్చాడుట.

"నీ వేషం ఏమిటి?"

"మన్మధుడు"

"చాలా బావున్నాయి నీ బట్టలు-వేషం బావుంది."

"ఇదేం వేషంలే" బోడి వేషం ఇంతకన్న మంచి వేషాలు వేశాను.

"నువ్వు చూడలేదుగాని వినాయకుడి వేషం చాలా బావుంటుంది. ఎంచక్కా ఏనుగుతల మనకి తగిలిస్తారు"

"నిజం ఏనుగుతలే!"

"అంటే నిజంకాదనుకో. అచ్చు అలాగే ఉంటుంది."

"అబ్బా!"

"అందులోవుంటే భలే బావుంటుంది."

"మరి నన్ను కూడా యిందులో చేర్చుకుంటారా రజీ?"

"చెప్పలేం. అయినా మేనేజరుతో నేనూ చెప్పి చూస్తాను. కాని నీకు గొంతులేదురా!"

"నిజమే! నేనుకీచుగా మాట్లాడతాను. మంచిగొంతుక లేనందుకు నామీద నాకే అసహ్యం వేసింది.

"మరెలా?" అన్నాను.

"అయినా పర్వాలేదులే. లత అనే ఒకావిడుంది. ఆవిడతో చెప్పిచూస్తాను"

ఈ లోగా ఎవరో ఇద్దరు మాదగ్గరికి వచ్చారు. రజీ వేపు చూస్తూ

"ఇకనువ్వు లేవాలి. నీ సీను దగ్గరికి వచ్చేసింది" అన్నాడు.

"నువ్వూ వస్తావేమిటి అక్కడికి" అన్నాడు రజీ.

"ఎక్కడికి?"

"తోటలోకి"

"ఏతోట?"

"అంతా చూపిస్తానుగా! పదముందు"

"ఇద్దరం పెద్దనిచ్చెన పట్టుకుని నాటకం ఆడుతున్న చోటికి సరిగ్గా మీదకివచ్చాం. మనుషులెవరూ కన్పించడం లేదు.

అక్కడ రథంలాంటి చిన్నతోటవుంది. దానిలో పెద్ద మహారాజులాగ కాలుమీద కాలు వేసుకూర్చున్నాడు రజీ. దానికి రెండు ప్రక్కలా పెద్దతాళ్ళు కట్టిఉన్నాయి. వాటిని నేలమీద ఎవరో పట్టుకూర్చున్నారు.

"ఇక్కడి కెందుకొచ్చాం?" అనడిగాను ఆతోట ప్రక్కనే వున్నయినుపదూలంమీదకూచుంటూ.

"మన్మథుడు స్టేజిమీద ప్రత్యక్షమవాలి. చూస్తావుగా?"

"అదెలా?"

"ఏమీకాకష్టంకాదు. సరిగ్గా ఆసమయానికి స్టేజిమీద వున్నవాళ్ళిద్దరూ దూరంగా జరుగుతారు. నేనే సమయంలో దిగుతానో వాళ్ళిద్దరికి తెల్సు. వెంటనే యీతాళ్ళు పట్టుకు కిందనకూచున్నవాళ్లు యీతాళ్ళు వదిలేస్తారు.రథం స్టేజీమీదకి దిగిపోతుంది. ఎలావుంది?"

"చాలాబావుంది. మరి చూసేవాళ్ళకి తాళ్ళు కన్పించవూ?"

"అవి కన్పించకుండా ఓ చిన్నగమత్తుచేస్తారు. హాల్లో ఓమూల నేలటపాకాయ పేలుస్తారు. హాల్లోవాళ్ళంతా చటుక్కున అటువేపుచూస్తారు.వెంటనే నేను దిగిపోతాను. తాళ్ళు మీదికిపోతాయి"

"బాగుందిరా తమాషా" అన్నాను. నాకిదంతా మాయలాగ కన్పించింది.

"ఇంకా చాలాటైముందిలే ఏమైనా కబుర్లు చెప్పు" అన్నాడు తొట్టిలో కూచునే.

ఎన్నో విషయాలు మాట్లాడాను. కాని యిందాకటి నుంచీ నాకొకటి అడగాలనిపిస్తోంది. ఇప్పుడిక ఆపుకోలేక అడిగేశాను.

"రజీ! ఒక్కసారి ఆ బట్టలూ, చెమ్కీవస్తువులూ నాకిస్తావూ? తొడుక్కుని మళ్ళీ నీకిచ్చేస్తాను"

క్షణంఆలోచించి సరేనన్నాడు. "త్వరగా తొడుక్కుని యిచ్చెయ్యాలిసుమా! లేకపోతే సీనువచ్చేస్తుంది"

"అలాగే" అన్నాను.

ఆతోట్టిలో కూచునే దుస్తులన్నీ నాకిచ్చాడురజీ. పంచె, చెవిమ్కాలు, కిరీటం అన్నీ పెట్టుకున్నాను. చాలా బావున్నయి. ఈవేషంలో నిర్మలచూస్తే బావున్ననిపించింది. ఆ యినుపదూలంమీదే అటూ యిటూ ఠీవిగా తిరిగాను. నోటికొచ్చిన మాటలల్లా వాగాను. మాకింద్రుగా యింకా నాటకం జరుగుతూనేవుంది.

"ఓ చుట్టవుంటే యివ్వరా" అన్నాడు రజీ.

వెంటనే తీసియిచ్చాను,స్టేజిలోనివాళ్ళందరికీ నావేషం చూపెట్టాలన్న తహతహపుట్టింది. అంచేత రజీతో అన్నాను. "రజీ దాహం వేస్తోందిరా!"

"అయితే నిచ్చెనమీంచి కిందికి దిగి వేగంగా తాగిరా" అన్నాడు చుట్టపొగవదుల్తూ.

నా సంతోషానికిక మేరలేదు,చకచకా నిచ్చెనమీంచి దిగిపోయేను. స్టేజిఅంతా తిరిగేశాను. ఎవరో ఒకావిడ నన్ను రెండుసార్లు బుజంమీద చెయ్యివేసి ఆ తొందర్లో పలకరించింది" "తయారయివున్నావా రజీ? జాగ్రత్తగా నటించాలి"

'ఓ' అన్నాను గర్వంగా. నేనింకా రజీఅనే అనుకొంటోంది ఆమె.

ఈవేషంమీద చుట్టకాలిస్తే ఎలావుంటుందో ననిపించింది. వెంటనే చుట్టతీసి వెలిగించాను. పొగల్ని వుంగరాలు చుట్టివదిలాను. ఓమూలనున్న బెంచీమీద కూచున్నాను.

ఆనేలపక్కనేవున్న కొన్నివస్తువులు నాదృష్టిని ఆకర్షించాయి. నేలటపాకాయలు అయిదారువున్నాయి. అక్క

డెవరో పెట్టినట్లున్నారు. వాటిని తీసుకొందు చేతులులాగాయి. ఇంకేమీ తోచలేదు. వెంటనే రెండు అందుకొన్నాను. జేబులో పెట్టుకోబోయాను కాని, పంచెవుండడంచేత జేబులు కన్పించ లేదు. నాలాగూ అయితేనే బావున్ననిపించింది. వెంటనే ఒకటితీసుకుని బలంగా గోడకికొట్టాను. అప్పుడొచ్చిన శబ్దంతో హాలంతా ప్రతిధ్వనించింది.

రజీ ఎక్కిన తొట్టితాళ్ళు పట్టుకొన్నవాళ్ళిద్దరూ నిద్రతో కునుకుతున్నారు. ఈశబ్దంవినగానే తాళ్ళువదిలేసే సమయం వచ్చిందనుకుని చటుక్కున తాళ్ళువదిలేసేరు. దానికి తయారుగాలేని యిద్దరినటులమీదా రథంతోపాటు వచ్చి పడి పోయేడు రజీ. చేతిలోవున్న చుట్టతో ఒకాయన నుదురుకాలి పోయింది. బనీనూ, లాగూతో, మొహానికి తెల్లరంగుతో వున్నాడువాడు.

ఇదంతా చూస్తున్ననాకు భలేనవ్వొచ్చింది. కాని స్టేజి మీాద వున్నవాళ్ళంతా ఏడుపు మొహంపెట్టేశారు. రజీ బెదిరి పోయేడు.

హాల్లో అలజడి ప్రారంభమైంది. అరుపులూ, పిల్లి కూతలూ, కేకలూ హెచ్చయాయి. చెప్పులూ, రాళ్ళూ స్టేజిమీాదకి వరసగా వచ్చిపడ్డాయి. వెంటనే తెరవేసేశారు.

పెద్దరాక్షసుడులాంటి ఒకాయన వచ్చి. "ఎవడ్రా వాడు! ఆ టపాకాయపేల్చాడు నాటకంమధ్యలో" అనరిచాడు. వాణ్ణి చూడగానే నాకు ప్రాణాలుపోయేయి. మిగతానేల టపా కాయలుకూడా పట్టుకుని తడికక్రిందనుంచిదూరిపోయేను ఒక్క ఉదుటుతో.

పైన బాబాయిని వెదికేసర్కి నాతలప్రాణం తోకకి వచ్చింది. నన్ను చూడగానే "ఎక్కడికిరా పారిపోయేవ్? నీకోసం అంతా వెదుకుతున్నాను" అన్నాడు. కాని నా వేషం చూడగానే ఆశ్చర్యపోయేడు.

"ఏమిట్రా యిదంతా!"

"వేషంబాబాయ్! నన్ను కూడా వేషంవెయ్య మన్నారు"

నా వేషం బాబాయికి నచ్చినట్టుంది. నన్ను కిందా మీదా చూసి నవ్వుతూ "అయితే వేశావురా? ఏ వేషం వేశావ్? నేను నాటకం చూడలేదు. నిన్ను వెదుక్కోవడం తోనే సరిపోయింది!" అన్నాడు నన్ను అమాంతంగా బుజం మీదకి ఎక్కించుకునడుస్తూ.

అక్కడినుంచీ కోతలు ప్రారంభించాను. నోటికివచ్చి నట్టుగా చెప్పేశాను,

అంతా చెప్పినతర్వాత బాబాయి చెవిలో మెల్లిగా అన్నాను. "రజీ కన్పించాడు బాబాయ్"

బాబాయి మొహం ఎర్రబడింది. "అలాంటిఅల్లరి వెధవల్తో యికనుంచీ నువ్వు స్నేహం చేయకూడదురా. నువ్వు యిప్పుడు పెద్ద నటకుడివయావ్" అన్నాడు.

# 13

ఇంటికి వచ్చాక స్నేహితులందరికీ నా వేషంచూపాను. రకరకాల కోతలు కోశాను. ముఖ్యంగా నిర్మల నా వేషానికి చాలా సంతోషించింది. ఆమెతో నేను మాట్లాడడం మానేసి చాలా రోజులయింది. అందుచేత నాదగ్గిరగా రావడానికి భయపడి నేను స్నేహితుల్తో యీ విషయాలన్నీ చెప్తున్నప్పుడు దూరంగా నిలబడివింది. నేనిదంతా గమనిస్తూనేవున్నాను. అందరితో మాట్లాడడం అయిపోయాక కీవిగా నడుస్తూ యింటిముఖం పట్టాను.

రెండడుగులు వేశానో లేదో నన్ను పిలిచింది నిర్మల. వెనక్కితిరిగి నిర్లక్ష్యంగా "ఏం" అన్నాను.

"నీ వేషం ఎంతో బావుంది గోపూ! నిజంగా" అంది.

"ఓస్. అంతేనా నువ్వు చెప్పదల్చింది"

"నిజంగా నేను చెప్పలేనంత బావుంది."

"నేను త్వరలో సినిమాకి వెళిపోతున్నాను తెలుసా?"

"మళ్ళీ ఎప్పటికి రావా?"

"రాను"

"మరి మీ బాబాయి?"

"అయన్ని తీసుకుపోడానికి ఒక్కసారి వస్తాను."

"మరి నేను?"

"నువ్వెందుకూ? ఎప్పుడేనా ఉత్తరం రాస్తానులే"

"అలాగే. నీకు మిఠాయి కావాలా? - యివాళ మా యింట్లో చేశారు"

"ఇప్పుడు తెచ్చావా?"

"ఇదిగో! నీకిద్దామనే వుంచాను"

"రైట్! యిలా తే"

"మరి నాకు వేషం వేసి చూపెట్టవూ?"

"ఓ! అలాగే"

"పోనీ నన్నూ మద్రాసు తీసికెళ్ళకూడదా గోపూ?"

"ఎందుకు తీసికెళ్ళగూడదూ? ఆలోచించి నిన్నూ తీసుకుపోతాను-ఏదీ మరికొంచెం మిఠాయి?"

"ఇంద, ఇదంతా నీకే!"

"భేష్. నువ్వు చాలా మంచిపిల్లవి"

"మరి నాతో స్నేహంగా వుంటావా?"

"ఎప్పటికీ, సూర్యుడూ, ఆకాశం ఉన్నంతకాలం నీతో స్నేహంగా వుంటాను" అన్నాడు మిఠాయి చప్పరిస్తూ.

మర్నాడు బడికి వెళ్ళేసమయానికి ఓ కుర్రాడు నాదగ్గరికి పరిగెత్తుకు వచ్చాడు.

"మీరే నా 'గోపూ' అంటే?"

"అవును. ఏం?"

"పడవదగ్గిర ఒకతను మీకోసం కూర్చొన్నాడు. వేగం రమ్మంటున్నాడు."

"ఎవరూ?"

"ఏమో నాకు తెలీదు"

"సరే నువ్వుపో. వస్తున్నానని చెప్పు"

నేను వచ్చేసరికి సీటిలో కాళ్ళుంచి, అటూ యిటూ ఆడిస్తూ పరధ్యానంగా కూర్చున్నాడు రజీ. నన్ను చూడ గానే కాళ్ళు ఊపడం ఆపి "ఇలారా-నావక్కనే కూచో" అన్నాడు గంభీరంగా.

నాకు వాడితీరుచూస్తే భయమేసింది. మెల్లిగా వెళ్ళి కూచున్నాను.

"గోపూ!"

"ఏం?"

"ఇదేపని ఇంకోడు చేసివుంటే చిదగ్గొట్టేసేవాణ్ని. లేకపోతే వాడితో ఎప్పుడూ మాట్లాడకుండా వుండేవాణ్ని."

"ఏపని?"

"నిజంచెప్పు. నువ్వేనా నేలటపాకాయ పేల్చావ్?"

"నేనే. కాని..."

"కానీ యేమిటి?"

"తెలీదు నాకు..."

"నేను చెప్పలేదూ?- అది పేలిస్తే రథం కిందికి దిగిపో తుందని?"

"మరిచిపోయేను"

"నువ్వు వెంటనే తప్పించుకు పారిపోయేవు. కాని నాటకం కంపెనీ కంట్రాక్టరు నేను అజాగ్రత్తగా ఉన్నందు వల్ల నిన్ను మీదికి రానిచ్చినందుకు తోలుపటకాతో చచ్చేట్టు కొట్టాడు. నేనుదాచుకున్న ఏభై రూపాయలూ లాక్కు న్నాడు. మరెప్పుడూ అటువేపు రావద్దని తిట్టి తగిలేశాడు

చూడు నావీపు" అని లాల్చీ ఎత్తి చూపించాడు, పటకా తగి లినచోట రక్తం గడ్డకట్టినట్టుంది. నల్లగా కమిలిపోయింది.

నేను ఏడ్చేశాను. "నన్ను క్షమించు రజీ!" అన్నాను.

"క్షమించాను. కాబట్టే మళ్ళీ నీతో మాట్లాడుతు న్నాను. పర్వాలేదులే, ఏడవకు. నీదగ్గర ఆకువుందా, అలస టగావుంది."

అలసట పోవడానికి మాదగ్గి రెప్పుడూ ఆకువుండేది. ఆ ఆకుల్ని రజీయే చూపాడు. జేబులోంచి గుప్పెటతో తీసి వాడి చేతిలో పోశాను.

"నువ్వింకా తోయతోటలోకి వెళ్తున్నావా?"

"లేదు. నువ్వెళ్ళిపోయినప్పట్నుంచీ వెళ్ళడం మానే శాను."

"మరాకోతిని ఏంచేశావ్?" ఆశ్చర్యపోతూ అడి గేడు వాడు. నాకు వాడిముఖం చూస్తుంటే జవాబు చెప్ప డానికి భయంవేసింది. మెల్లిగా "అక్కడే వదిలేశాను" అన్నాను. వాడా మాటకు ఎగిరి గెంతేశాడు.

"ఎంతపని చేశావురా దరిద్రపు వెధవా! - నేనెంతో కష్టపడి దాన్ని సంపాయిస్తే దాన్నక్కడే వదిలేసివచ్చావా? ఛస్, నీకు బుద్ధిలేదు. అన్నాడు" ఇంకోణ్ణయితే రజీ ఆసమ యంలో పాతేసును.

"నాకు తెలివిలేదు.నిజమే" అన్నాడు తలవొంచుకుని.

"అది నీదగ్గరలేదుకాబట్టే నువ్వు అదృష్టవంతుడివి కాలేకపోయావ్. నా అదృష్టాన్నికూడా పాడుచేశావ్. పోనీ యీరాత్రికి అక్కడికివెళ్దాం. నాకు బాగా ఆకలిగావుంది. ఏమైనా తెచ్చిపెట్టు" అన్నాడు.

"సరే పావుగంటలో వస్తానుండు" అని వూరులోకి పరిగెత్తాను.

సరాసరి నిర్మలదగ్గరికి వెళ్లాను. క్లాసులో పాఠంజరుగుతోంది. ఎవ్వరూ చూడకుండా గాలిపడగ జారానికి రాయికట్టి నిర్మలకాలికి తగిలేట్టువదిలేను. నావేపుచూసింది "బయటికిరా" అన్నట్టుసంజ్ఞచేశాను. మాష్టరుతో ఏదోచెప్పి బయటికి వచ్చింది.

"ఇవాళ బడికిరాలేదేం?" అన్నది ఆశ్చర్యంగా.

"అదంతా తర్వాత చెప్తాను. నీదగ్గర యిప్పుడేమైనా డబ్బువుందా?"

"ఎందుకూ?"

"రజీ వచ్చాడు. అతనికి మంచి ఆకలి వేస్తోంది"

"అయితేవుండు యిప్పుడేవస్తాను" అని క్లాసులోకి వెళ్ళిపోయింది. నేనెవరికీ కన్పించకుండా గోడకిఅనుకునే నిలబడ్డాను. తన స్నేహితురాళ్ళందరితోనూ ఏదో గుసగుస లాడడం నాకు విన్పిస్తూనేవుంది. మరోక్షణంలో బయటికివచ్చింది.

"ఇదిగో, యివన్నీ తీసుకుపో" అంది.

ఆమె యిచ్చినవన్నీ చూసుకొన్నాను. రెండు రొట్టె ముక్కలూ, బఠానీలూ, చాకెట్లూ మూడుబిస్కట్లూ, నాలుగైదు ఓ బేడా తీసుకొచ్చింది. "ఇవిచాలు" అనుకొన్నాను.

మరిక వెనక్కితిరిగి చూడకుండా పారిపోయేను. సాయిబుకొట్లో ఓపెద్దసీసా ఎరువుకి తీసుకుని దాన్నిండా నీళ్ళునింపాను. వెంటనే పడవదగ్గరికి పరుగుతీశాను. ఇంకా అలానే కూర్చొని

వున్నాడు రజీ, నేను తెచ్చినవన్నీ ముందుపెట్టగానే తింటూ కూచున్నాడురజీ. నేను ఎదురుగ్గాకూచొని చుట్ట వెలిగించాను.

"ఇకమీాదట ఏంచేస్తావురజీ?"అన్నాను వాడు బిస్కట్లు నవులుతూంటే.

మెల్లిగా అన్నాడు. "నాకు జీవితంమీాద విరక్తిపుట్టిం దిరా!"

వాడన్నదానిలో రెండుమాటలఅర్థం నాకు బోధపడ లేదు.

"జీవితం, విరక్తిఅంటే ఏమిటిరా?" అన్నాను.

"జీవితం అంటే మనప్రాణంఅన్నమాట. విరక్తిఅంటే చచ్చిపోవడం. ఆమాట అనుకొన్నవాళ్ళు చచ్చిపోవాలను కుంటున్నారన్నమాట"

"అయితే నువ్వు చచ్చిపోతావా?"

"అలా అనిపిస్తోంది"

"మరెప్పుడూ నేలటపాకాయ పేల్చనుగా!—చచ్చి పోకురా" అని బ్రతిమాలాను.

"ఓస్! అందుకు చచ్చిపోతాననుకున్నావేమిటి? నాకు విరక్తి పుట్టింది"

"నాకూపుట్తే బావుణ్ను" అనుకున్నాను. "మరినాకె ప్పుడు పుడ్తుంది?"

"అందరికీపుట్టదు. పెద్దపెద్దవాళ్ళకి పుడుతుంది"

"అయితే నువ్వు పెద్దవాడివయావా?"

ఎంతో గొప్పవాడిలాగ నవ్వేడువాడు. ఆనవ్వు

చూస్తూంటే నిజంగానే పెద్ద వాడయాడే మోననిపించింది. మరా విషయం మాట్లాడలేదు నేను.

"రాత్రి ఎన్నిగంటలకి వచ్చేదినేను?"

"ఇంకా మీబాబాయి నిన్ను అడ్డుపెడుతున్నాడా!"

"ఊఁ"

"మరెలావస్తావ్?"

"ఎలాగో వచ్చేస్తాను. భయంలేదులే"

"సరే. పదకొండుగంటలకి సాయిబు దుకాణందగ్గరికిరా టోపీలుకుడుతూవుంటాను. అక్కడలేకపోతే స్మశానంలో కాటికాపరి వీరయ్యకు కర్రలుకొట్టి యిస్తూంటాను. మూడణాలు యిస్తాడు రోజుకి"

నేను భయపడ్డాను. "స్మశానానికి రోజూ వెళ్తావా!"

'వెళితేయేం?'

"మరి నీకు భయంవెయ్యదూ!"

"మనకెందుకూ భయం? మనుష్యులు చచ్చిపోతేనేగా శవాలవుతారు?"

"నేనా స్మశానం దగ్గరికి రాలేనుబాబూ!"

నవ్వేడువాడు. "సరే.సాయిబు దుకాణం దగ్గరికే రా" అలాగేనని యింటికి వచ్చేశాను.

రాత్రి బయల్దేరి దారిలోనే రజీని కల్సుకున్నాను.నన్ను చూడగానే "నువ్వురాలేదేమో ననుకున్నాను.నీకోసమే యింటికి వస్తున్నాను" అన్నాడు.

మరినాలుగుఅడుగులు వేసి ఆగిపోయి, "కొవ్వొత్తులు

మరిచిపోయాను" అన్నాడు.

"నేను తెచ్చానులే పద. నువ్వు తొందరమనిషివి. నాకు తెలుసు"

ఇద్దరం పడవమీదకూచున్నాం. నేను తెడ్డువేశాను. రజీ చుక్కానిపట్టాడు.

"చాలాగోజులయిందిరా పడవెక్కి" అన్నాడు.

నేనేమీ మాట్లాడలేదు. తెడ్డువేస్తున్నాను."నిర్మలతో యింకా మాట్లాడడం లేదా?" అన్నాడు కాస్సేపటికి.

నేను అప్పటికీ మాట్లాడలేదు.

"జవాబు చెప్పవేం?"

"నీ నాటకంనుంచి వచ్చాక మాట్లాడుతున్నాను. నిర్మలే ముందు నాతో మాట్టాడింది. లేకపోతే మాట్లాడే వాణ్ని కాదు" అన్నాడు తప్పుచేసినవాడిలాగ.

"మంచిపనిచేశావ్. మాట్టాడమని నీతో చెప్పాలను కున్నాను. నువ్వు మాట్టాడకపోతే ఆ అమ్మాయి బాధపడు తుంది"

రజీ యిలా అంటాడనుకోలేదు. ఆశ్చర్యపోయేను.

ఒడ్డుచేరిందివడవ. నేను కొవ్వొత్తి వెలిగించాను.

"నాసామాన్లన్నీ ఎక్కడచేర్చావ్?" అనడిగాడు రజీ లోయతోటలోకి చేరాక.

"నన్ను తీసుకోమన్నావుగా! అయినా తీసుకోలేదు. అన్నీ దాచివుంచాను. నీక్కావలిస్తే యిచ్చేస్తాను"

"అన్నీ అక్కర్లేదులే. కొవ్వొత్తులూ, చిన్నపొయ్యీ,

పిట్టల్ని కొట్టే వంపుకర్రమాత్రంయిచ్చేయ్. మిగతావన్నీ తీసుకో"

"సరే"

మాస్థలం దగ్గరికి వచ్చేశాం. అక్కడ బాగా చెట్లు పెరిగిపోయేయి. చీకటి దట్టంగా ఉంది. ఏవో పిట్టలు అరుస్తున్నాయి. నాకు భయం వేసింది. అయినా రజీ హేళనచేస్తాడేమోనని మాట్లాడలేదు. వాడి వెనకనే నడుస్తున్నాను. బొమ్మల్ని తోసుకుంటూ వాడు దారిచేసుకు నడుస్తున్నాడు.

మాట్లాడుతున్నవాడల్లా హఠాత్తుగా ఆగిపోయాడు. నేను తుళ్ళిపడ్డాను. "ఏం?" అన్నాను.

"ఇష్! గట్టిగా మాట్లాడకు?" అన్నాడు తలెత్తి చూపుతూ. నేను వణికిపోయేను.

"ఏంజరిగిందిరా!" అన్నాను భయం భయంగా.

"జాగ్రత్తగా విను "

"ఏమిటి!"

"నీకేమైనా శబ్దం విన్పిస్తోందా?"

చెవులురిక్కించివిన్నాను. "విన్పించటంలేదు"అన్నాను.

"ఇంకా జాగ్రత్తగా వినరా వెధవా! - ఆకులరాపిడి విన్పించడంలేదూ?"

నేనిక నిలబడలేకపోయాను. నిజంగానే రాపిడిశబ్దం విన్పిస్తోంది. "ఎలాగురా రజీ!" అన్నాను వాణ్ణి గట్టిగా పట్టుకుని.

"ఉండు భయపడకు. అసలదేమిటో చూడనీ"

"వద్దు వద్దు. వెంటనే వెనక్కి పారిపోదాం, అది దెయ్యమయి ఉంటుంది."

"ముండరే అంత భయపడిపోతావేం? నేనున్నానుగా! నా చెయ్యిపట్టుకో."

జాగ్రత్తగా ఆశబ్దం విన్నాం. ఇంకా రాపిడి వినిపిస్తూనేవుంది. మాకు రెండు గజాలదూరంలో వున్న చెట్టు అవతలివేపు కొమ్మ చీకటిలో కదులుతూ కన్పించింది. రాపిడి రానురాను ఎక్కువయింది. నేను వణికిపోతూనే ఉన్నాను. హఠాత్తుగా ఏదో పెద్ద ఆకారం నేలకూలింది. అక్కడితో పెద్ద శబ్దమయింది. మేమిద్దరం వెనక్కి గెంతాం. మరోక్షణానికి రాపిడి ఆగిపోయింది. ఏదో బూరలోంచి ఊదినట్టు అరుపు విన్పిస్తోంది.

"నిజంగా యిదేదో దెయ్యంరా" అన్నాను తడిలేని గొంతుతో,

"ఉండు అదేదో తేల్చేసుకుందాం. మనస్థలంలోకి ఆ దెయ్యం ఎలా వచ్చిందో కనుక్కుందాం."

"ఎవరక్కడ?" అని గట్టిగా అరిచాడు, వాడి గొంతు కూడా వణికింది.

వాడలా అరిచాడో లేదో శబ్దం ఆగిపోయింది. ఏదో ఆకారం మా పక్కనుండి రాసుకుపోయింది. నేను భయపడి కెవ్వున కేకవేశాను. రజీ నన్నువదిలి దానివెనక పరుగెత్తాడు. నేను కళ్ళుమూసుకు నేలన చదికిలబడిపోయేను. మరోక్షణంలో తుపాకిపేలిన చప్పుడు లోయ అంతా ప్రతిధ్వనించింది. వెను వెంటనే రజీ గావుకేక విన్పించింది. అంతే. మళ్ళీ అంతా నిశ్శబ్దమయిపోయింది.

నేను భయంతో ఏడ్చాను. "రజీ!" అని రెండు మూడుసార్లు అరిచాను.

మెల్లిగా జేబులోంచి మరో క్రొవ్వొత్తితీసి వెలిగించి అడుస్తూ రజీని వెదుక్కొంటూ బయల్దేరాను. దూరంగా ఏదో ఆకారం నాకు కన్పించింది. వెంటనే మోకాళ్ళమీద నిలబడి దండంపెడుతూ "నన్నుక్షమించు దెయ్యంగారూ! ఇప్పుడే రజీని తీసుకు నేను వెళ్ళిపోతాను." అన్నాను.

"ఇంత రాత్రిలో యీ స్థలానికెందుకొచ్చారు?" అనడిగింది దెయ్యం.

"మేమెప్పుడూ యిలా వస్తూవుంటాం.మీరే యిప్పుడు వచ్చారు. మీరు కొత్తదెయ్యం కాబోలు!

"నేను దెయ్యంకాదు."

"మరి!"

"సైనికుణ్ని"

"సైనికులా!- మీదగ్గర తుపాకీ వుందా?"

"వుంది—పిట్టల్ని కొట్టేది"

"అయితే అది నామీద కాల్చకండి"

"మీరు శత్రువులు కారా?"

"మేం కుర్రవాళ్ళమండి—మాకదేం తెలీదు"

"అలాగా—అయితే పొరపాటు జరిగిపోయిందే!—నా వెనక పరిగెత్తుకువచ్చినవాడెవడూ?"

"మా నేస్తం—రజీ!"

"మరి నా వెంటపడ్డాడేం?"

"మీరు దెయ్యం అనుకున్నాడు"

"మంచి బాగా నేజరిగింది" అంటూ నవ్వేడతను. ఇప్ప టికి అతనిముఖం కన్పించిందినాకు. కొవ్వొత్తి వెలుగులో అతన్నిచూశాను. బొద్దుమీసాలూ, నల్లటిముఖం అతనూ భయంకరంగా వున్నాడు. చేతిలో తుపాకీవుంది.

"మా రజీనిచంపేశారా!" అన్నాను భయంగా.

"ఏమో తెలీదు. చీకటిలో తుపాకీ పేల్చేశాను. చచ్చిపోడులే. పిట్టల్నికొట్టే రవ్వలతుపాకీ యిది-నువ్వా వెదుకు" అన్నాడు చుట్టూచూస్తూ.

"రజీ" అని మళ్ళీ అరిచాను.

దగ్గర్లో మూలుగు విన్పించింది,

ఇద్దరం అటువేపు నడిచాము. కొవ్వొత్తి వెలుగులో రజీ ముఖం కన్పించింది నాకు. నేలమీద పడిపోయివున్నాడు.

"రజీ" అనరిచాను.

"ఏడవకులే. బుజంలోంచి పోయింది తుపాకీగుండు అన్నాడు. తర్వాత సిపాయిని చూసేడు. "మీరేనా నన్ను కొట్టారు!" అనడిగాడు.

పాపం! సిపాయికూడా మాలాంటి కుర్రాళ్ళని కొట్టి నందుకు చాలా బాధ పడ్డాడు.

"నేనేకొట్టేను, ఎవరో అనుకోని. పరవాలేదులే. కదల గలవా నువ్వా!

"బుజం బాగా నెప్పి పుట్తోంది"

"అయితే నా నడుంమీదకి వత్తిగిలు. నా దగ్గర మందుంది. పెట్తాను" అంటూ రజీనిబుజంమీదకి ఎత్తుకున్నాడు. నే నతని తుపాకీపట్టుకుని కొవ్వొత్తితో ముందుకి నడిచాను.

ఇంకాక శబ్దాలు విన్పించినచోటుకి ముగ్గురంవచ్చాం. రజీని పడుకోబెట్టి గాయం తగిలినచోట చుట్టూరా కడిగాడు. కత్తితో చుట్టూకోశాడు. తుపాకీ రవ్వతీసేశాడు. తర్వాత ఏదోమందు వేసి కట్టు కట్టాడు.

ఇంత జరుగుతున్నా, రజీ ఏడవలేదు. పళ్లునొక్కిపెట్టి బాధని ఓర్చుకున్నాడు.

దగ్గర్లోనే వేడిపులుసు పొయ్యిమీద ఉడుకుతోంది. కట్టుకట్టడం అయిపోగానే కాస్త పులుసు గిన్నెలోపోసి రజీచేత తాగించాడు. నేనూకాస్త తాగాను. అప్పటికి యిద్దరికీ భయం పోయింది.

"ఎవరో శత్రువులనుకొని తుపాకీపేల్చాను" అని నొచ్చుకున్నాడు సిపాయి.

"పర్వాలేదులే. దెయ్యాన్ని ఎప్పుడూ చూళ్లేదు. చూడాలనిపించి మీవెంట పరిగెత్తాను.

"మీరిక్కడి కెందుకొచ్చారు?—యింతరాత్రిలో"

"ఇది మా రహస్యస్థలం. మరి మీరు?"

"దానికంతా పెద్దకథ ఉందిలే" అన్నాడు సిపాయి.

"అయితే చెప్పండి"అన్నాన్నేను.

"మీ పేరేమిటి?"

"ఆశీర్వాదం. క్రిస్టియన్ని."

"ఇక్కడికొచ్చి ఒక్కరూ ఉన్నారేం?"

"కథంతా చెప్తాను వినండి. నేను మీరుపుట్టకముందు నుంచీ సైన్యంలోఉన్నాను. సరిగ్గా 1932లో చేరేను. అప్పట్నుంచీ ఎన్నివూళ్ళు తిరిగానోచెప్పలేను. కొరియా, మలయా,

సుమిత్రా, కాశ్మీర్, నైనిటాల్ అన్నీ వెళ్ళాను. రెండో ప్రపంచయుద్ధంలో కూడా పనిచేశాను"

"మీరూ యుద్ధంచేశారా?" అన్నాను నేను.

"ఓ. అప్పుడే యీ చేతిలోంచి గుండు వెళిపోయింది. ఇదిగో మచ్చ" అనిచూపించాడు. "నాలుగేళ్ళ క్రిందట మేం కొచ్చిన్ వచ్చేశాం. అక్కడ మాసిబ్బందికి చాలా కష్టంగా ఉండేది. మాపైఆఫీసరు, మంచివాడు కాడు. ఎవరో సింగు, మమ్మల్ని చాలాకష్టాలు పెట్టేవాడు."

"అంటే?"

"ఎప్పుడన్నా బయటికి తిరిగిరావాలంటే పంపించే వాడు కాదు."

"పారిపోవలసింది"

"పారిపోకూడదు.అలాగయితే కాల్చేస్తారు. నాదసలు గుంటూరు. అక్కడ నా పెళ్ళాంఉండేది.ఓసారి అక్కణ్నుంచి ఉత్తరం వచ్చింది— వెంటనే రమ్మని. వెళ్ళడానికి శలవు అడిగాను. ఇవ్వను పొమ్మనాడు.మరోసారి అడిగితే పిచ్చాసు పత్రిలో పడేయిస్తానన్నాడు. మర్నాడు మళ్ళీ అడిగేసరికి నిజంగానే మిలట్రీ ఆసుపత్రిలో పడేయించేడు. పిచ్చాసుపత్రి అంటే మీకు తెలీదు. అక్కడ నెలరోజులుంటే నిజంగానే పిచ్చెక్కుతుంది. అక్కడ పద్నాలుగు నెలలున్నాను. ఓరోజు మళ్ళీ నా భార్యకి జ్వరంగావుందనీ, వెంటనే రాకపోతే చచ్చిపోతుందనీ ఎవరో రాశారు. అప్పటికింకా ఆ ఆఫీసరు మారలేదు. వెళ్ళి అడిగినా వీల్లేదన్నాడు. ఆకోపంతో తుపాకీతో చితకతన్నేశాను. అంతే చుట్టూవున్న వాళ్ళంతా నన్ను కొట్టి గదిలోపడేశారు, నాకింకా యింటికి వచ్చేయ్యా

లన్న ఆశపోలేదు. మరివారంరోజులుపోయేక ఓరోజు వీలు చూసుకు ఉడాయించాను. ఆనాడు వాళ్ళచేత తన్నులు తిన డంతో యీ చెయ్యి చాలావరకూ పచ్చడయిపోయింది. నేను పారిపోయిన మర్నాడే నాగురించి దర్యాప్తు ప్రారంభ మయింది. అప్పుడే మనుషులు బయల్దేరిపోయేరు. మద్రాసు దాటగానే ఓ సిపాయి అటకాయించాడు. తప్పుకుపారిపోవ డంలో అతను తుపాకితో కొట్టాడు. ఈకాలుపోయింది. "నాకిప్పుడీ కాలూచెయ్యీ అంతగా పనిచెయ్యవు" అన్నాడు.

మా యిద్దరికీ అతనిమీద జాలేసింది.

"ఇప్పుడేం చేస్తారు?" అన్నాను.

"ఇక్కడికి వచ్చేసరికి నా భార్య చచ్చిపోయి చాలా రోజులయిందని తెల్సింది. అక్కడా కొందరు మనుషులు నాకోసం వెదుకుతున్నట్టు పసిగట్టాను. ఇక్కడికి పారిపోయొచ్చాను."

"ఇక్కడ ఎన్నాళ్ళుంటారు?"

"ఏమో చెప్పలేను. ఎవరూ పసిగట్టకుండావుంటే యిక్కడే ఉండిపోతాను. లేదా ఎక్కడికో పోవాలి"

"ఎప్పుడూ యిక్కడే ఉండిపోండి" అన్నాడు రజీ.

"వాళ్ళకి దొరికితే ఏంచేస్తారు!"

"వెంటనే జైలుకితీసుకుపోతారు. పై ఆఫీసర్ని కొడితే ఊరుకోరు. కాల్చేస్తారు. ఉండండి. బిస్కట్లు తెస్తాను" అని సంచికోసం దూరంగా వెళ్ళాడు.

"ఇలాంటివాళ్ళని ఉంచకూడదు రజీ! ప్రమాదం. పంపెయ్" అన్నాడు మెల్లిగా.

రజీ మాట్లాడలేదు. కళ్ళుమూసుకు ఏదో ఆలోచిస్తు న్నాడు. ఇంతలో సిపాయివచ్చి యిద్దరికీ బిస్కట్లుయిచ్చాడు. తినేశాక "ఇక బాగాచీకటి పడిపోయింది. మీరింటికి వెళ్ళిపోండి" అన్నాడు.

"నాకుయిల్లులేదు. నేనిక్కడేఉంటాను" అన్నాడు రజీ.

"నేనుమాత్రం యింటికిపోతాను. బాబాయిలేస్తే కోప గస్తాడు" అన్నాన్నేను.

"సరే, నేనుదిగబెట్టివస్తాను పద'' అని లేచేడు ఆశీ ర్వాదం.

నేను రజీతో ఏమీ చెప్పకుండా, మౌనంగా అతని వెనక నడిచాను.పడవలోకూడా సిపాయితో ఏమీ మాట్లాడ లేదు. నన్నావతలి ఒడ్డుకి దింపేశాక నా బుజంతట్టి నవ్వుతూ.

"భయపడకబ్బాయ్! — మిమ్మల్నేం చెయ్యనులే" అన్నాడు.

నేను అంత చీకట్లోనూ మెల్లగా నడిచివచ్చేశాను ఏదో ఆలోచించుకుంటూ.

# 14

ఆశీర్వాదం విషయం ఎవరితోనూ చెప్పలేదు. చెప్తే తుపాకీతో కాల్చిపారేస్తాడేమోనని భయం. కాని ఎవరికీ చెప్ప నని ఒట్టు వేయించుకుని మాత్రం నిర్మలతో చెప్పాను. అతని దగ్గర తుపాకీవున్న విషయం నొక్కి నొక్కి చెప్పాను. మా అంద రినీ సైన్యంలో కలిసిపొమ్మన్నాడనీ, మేమిక కల్సిపోతున్నా మనీ రెండుమూడురోజుల్లో కాశ్మీర్ వెళ్ళిపోతామనీ చెప్పేను. నిర్మల బెదిరిపోయింది.

"నిజంగా వెళ్ళిపోతావా గోపూ!"

"నేనెప్పుడయినా అబద్ధం చెప్పానా యేమిటి! నీదగ్గర నేను చస్తే అబద్ధం చెప్పను"

"అయితే మీ బాబాయి ఎలాగ?"

"అక్కడికెళ్ళాక యుద్ధంలో పోరాడు తున్నట్టు బాబాయికి వుత్తరం వ్రాస్తాను...అదిచూసి డంగైపోతాడు"

"మరి నేను"

"నాలాంటి యోధుల్ని పెళ్ళాడడంవల్ల నీ కేంలాభం చెప్పూ?-ఎప్పుడో యుద్ధంచేస్తూచేస్తూ చచ్చిపోతాను"

"అయితే మీ బాబాయితో చెప్పేస్తాను"-అని పరిగెత్తింది.

"నిర్మలా!" అనరిచాను.

బాబాయితో చెప్తే నాపని ఏమౌతుందో నాకు బాగా తెల్సు.అంచేత అడ్డుత్రోవన వెళ్ళి నిర్మల మెడపట్టుకున్నాను. "మరినీ జట్టు వుంటానులే. ఎవరితోటీ యీ విషయం చెప్పకు. పెద్ద రహస్యం-మరోటి-నీకు చెప్తాను"

"ఏమిటది?"

"రజీకి తుపాకిగుండు బుజంలోంచిదూసుకుపోయింది"

"అమ్మబాబోయ్! అయితే చచ్చిపోయేడా?"

"చచ్చి పోవలసిందే కాని ఆ సిపాయీ, నేనూ బ్రతికించాం" అంటూ ఆవిషయమంతా చెప్పాను. అంతా చెప్పాక "మరినాకోసం ఏమైనా తెచ్చావా?" అన్నాను.

"కోవా బిళ్ళలున్నాయి-యిచ్చేదా!"

"కోవా అంతమంచిదికాదులే. అయినా యియ్యి" అంటూ పుచ్చుకుని గుటక వేశాను.

మరో యిరవై రోజులవరకూ లోయతోటవేపు వెళ్ళ లేదు నేను. రజీకూడా కన్పించలేదు. ఇంకా గాయం మాన లేదనుకున్నాను. అటు వేపు వెళ్ళడానికే భయంవేసింది. రోజు నేనూ నిర్మలా చెట్టపట్టాలేసుకుని సరదాగా కబుర్లు చెప్పుకుంటూ యింటికి వచ్చేస్తున్నాం. చుట్టూ చాలామంది నడిచిపోతున్నారు ఇంతలో 'గోపూ!' అన్న పిలుపు విన్పిం చింది. నన్నెవరు పిలుస్తున్నారా అని ఆశ్చర్యపోయాను. మళ్ళీ విన్పించింది ఆ పిలుపు.

"ఎవరు నువ్వు?" అన్నాను ఆగి.

"నేను – ఆశీర్వాదాన్ని – సందుమొగలో—"

అటు వేపు చూశాను. పెద్ద గెడ్డాలు పెట్టుకున్న బిచ్చ గాడు కన్పించాడు నా వేపుచూసి సంజ్ఞచేశాడు. నాకు భయం వేసింది.

"నువ్వు వెళ్ళిపో నిర్మలా! – నేను తర్వాత వస్తాను"

"నాకూ సిపాయిని చూడాలనివుంది గోపూ!" అంది.

"నువ్వు చూడలేవు. భయమేస్తుంది"

"నాకేం భయంలేదు నేనూవస్తా"

మరి తప్పలేదు. ఆమెతో కలిసే సాధువు దగ్గరికి వచ్చాను. మాతో మాట్లాడకుండానే వడవడగ్గరికి నడిచా డతను. నిర్మల చెవిలో మెల్లిగా అన్నాను! "ఇతనేసిపాయి?"

"అదేమిటి! సిపాయి యిలా వున్నాడే— నల్లగా ఫెళ్ళుద్దులాగ"

"ఇష్! గట్టిగా అరవకు. చంపేస్తాడు"

నిజంగానే భయమేసిందామెకు — నాచెయ్యి గట్టిగా పట్టుకుని నడిచింది. పడవదగ్గరకి వచ్చేవరకూ ఏమీ మాట్లాడలేదు సిపాయి. తర్వాత వెనక్కి తిరిగి నవ్వుతూ "అయితే నిర్మలకికూడా నన్ను చూడాలనిపించిందేవిఁటి!" అన్నాడు.

నేను గొణిగాను అవునని—

ముగ్గురం పడవ ఎక్కాం.

"రజీకి ఎలా వుంది?" అని మెల్లిగా అడిగాను.

"చూస్తావుగా?" అన్నాడతను చుక్కాని పట్టుతూ.

మరో అయిదు నిముషాల్లో ఆవలి వొడ్డుకు చేరిపోయేం.

"నిశ్శబ్దంగా నడవండి - మన అలికిడి కాకూడదు." అన్నాడు ఆశీర్వాదం. నాకు మళ్ళీ వణుకుపుట్టింది. "ఎవరన్నా కొత్తవాళ్ళు వచ్చారా!"

"రాలేదు. కాని ఎవరన్నా వస్తే కాల్చెయ్యమని రజీకి తుపాకీ యిచ్చాను. అరుపు విన్పిస్తుంది చూడండి—"

మరి పదడుగులు వేశామో లేదో రజీ అరుపు విన్పించింది.

"హాల్ట్ హు కమ్స్ దేర్! ఫ్రెండ్ ఆర్ ఫో"

"ఫ్రెండ్స్!" అని చెయ్యి వూపాడుఆశీర్వాదం నవ్వుతూ.

నిర్మల యిదంతా చూసి పొంగిపోయింది.

"ఆమాటలకి అర్థం ఏమిటండీ?" అనడిగింది.

"ఆమాటలంటే ఎవరన్నా ఆగిపోవాలన్నమాట. లేకపోతే కాల్చేస్తాడు. మీరు స్నేహితులా, శత్రువులా?

అని అడుగుతారు. స్నేహితులని వెంటనే చెప్పాలి. లేక పోతే చంపేస్తారు"

"భలేబావుంది పద్ధతి" అంది.

దగ్గరికి రాగానే రజీ తుపాకీతో ముందుకి వచ్చి సెల్యూట్ చేశాడు. ఆశీర్వాదంకూడా సెల్యూట్ చేసి తుపాకీ అందుకున్నాడు.

రజీని చూడగానే నేను ఆశ్చర్యపోయేను. సిపాయిలాగే పూర్తిగా మిలటరీబట్టలు వేసుకున్నాడు. చిన్న టోపీ, బూట్లూ వేసుకున్నాడు.

"బట్టలు చాలా బావున్నాయి రజీ!" అంది నిర్మల చప్పట్లు చరుస్తూ. నా వేపు తిరిగి "నువ్వూ అలాంటి బట్టలు వేసుకు గోపూ" అంది.

"ఛ! నేను సిపాయికాను" అన్నాను విసుగ్గా.

ముగ్గురకూ టీ తెచ్చియిచ్చేడు సిపాయి. టీ బాగా చేస్తాడితను. టీ తాగడం అయాక చెట్టుకి ఆనుకుని ప్రారంభించాడు. నేనిక్కడ ఉన్నట్టుకూడా వాళ్ళకి తెల్సిపోయింది. మూడురోజుల క్రితమే నాగురించి పేపర్లోకూడా వేశారట. అందుకని ఎప్పుడు వెళ్ళిపోతానో తెలీదు. వెళ్ళిపోయేటప్పుడు మీకు చెప్పకుండానే వెళ్ళిపోతాను. మీరుమాత్రంజాగ్రత్తగా వుండండి– దేశంకోసం ఏమైనా చెయ్యడానికి సిద్ధపడాలి– అందుకనే నేను మిలటరీలోకి వెళ్ళేను"

"నేనూ వెళిపోతాను" అన్నాడు రజీ వీరుడిలాగ.

"మీరింకా చిన్నపిల్లలు. మరి అయిదారేళ్ళుపోతే గాని మిమ్మల్ని తీసుకోరు. అంతవరకూ నిజాయితీగా బ్రత

కడం, మంచిపనులు చెయ్యడం - యివన్నీ నేర్చుకోవాలి. "యిలాంటి విషయాలెన్నో చెప్పాడు. బైబిలుతీసి అక్కడ క్కడ చదివి విన్పించాడు. దాంట్లో చాలామంచి వాక్యా లున్నాయి. కొన్ని నాకు బాగా నచ్చాయి:"

"నీ పొరుగువానిని నీవలెనే ప్రేమింపుము" యిల్లాం టివి - అంతా అయ్యాక మమ్మల్ని వరసగా నిలబెట్టి 'జనగణ మన' పాడించాడు.

"ఇకపదండి. మిమ్మల్నిద్దర్నీ దిగబెట్టి వస్తాను" అన్నాడు ఆశీర్వాదం.

మేమిద్దరం వచ్చేశాం. దారిలో నిర్మల అడిగింది. "అయితే గోపూ! నీకు సైన్యంలో చేరడం యిష్టంలేదా యేమిటి?"

"తూ! వెధవసైన్యంలో ఎవరు చేరుతారు?" అన్నాను.

నిర్మల మాట్లాడలేదు. వెళిపోతూ వెళిపోతూ అంది: "నేనే మొగాడినయితే సైన్యంలో చేరిపోయేవాణ్ణి."

# 15

వారంరోజులతరవాత ఓ రోజు సాయంకాలం రజీ మాయింటి కిటికీదగ్గరికివచ్చి పిలిచాడు. నేను మెల్లిగా బాబాయి చూడకుండా బయటికి వచ్చాను.

"వస్తావేమిటిరా?" అన్నాడు రజీ, నన్ను చూసి.

"ఎక్కడికి?"

"తోటలోకి"

"ఏం?"

"చెప్తాగా?"

"సరే వుండు" అని లాల్చీ తీసుకుని రజీవెంట బయ ల్దేరేను. చాలాదూరంవరకూ రజీ ఏం మాట్లాడలేదు. చివ రికి ప్రారంభించాడు.

"ఆశీర్వాదంగారు నన్ను పెంచుకుంటారట."

"అదేమిటి?"

"ఆయనకి పిల్లలెవరూ లేరు. నేనే తనకి నచ్చాననీ, నన్నుతనతో తీసుకుపోయి చదువు చెప్పిస్తాననీ అన్నారు."

"ఎక్కడికి వెళిపోతారు?"

"ఇంకా తెలీదు. ఎక్కడికో దూరంగా - బొంబాయి లాంటి ఊరికి వెళిపోదాం అనుకున్నాం."

"మరి నేనో!"

"నీకేం? మీ బాబాయి వున్నాడుగా!"

"బాబాయిని వదిలేసి వచ్చేయమంటే నీతో వచ్చే స్తాను."

"ఏమో! ఆయన్ని కనుక్కోవాలి. ఇప్పుడెక్కణ్నుంచి వస్తున్నానో తెలుసా!"

"ఎక్కణ్నుంచి!"

"బందరు"

"ఎందుకు వెళ్ళారక్కడికి?"

"ఆశీర్వాదంగారికి కొందరు బంధువులక్కడవున్నారు. వాళ్ళకి కొన్ని వుత్తరాలిచ్చిరావడానికి అక్కడికి వెళ్లాను."

రజీ ఎంతో పెద్దవాడయిపోయినట్టు అనిపించింది నాకు.

"అయితేఆరురోజులబట్టీ నువ్వు అక్కడ లేవన్నమాట"

"నేను ఇప్పుడే ఊరునుంచి వస్తున్నాను"

లోయతోటకి వచ్చేసరికి సరిగ్గా ఎనిమిదయింది. రజీ తెచ్చిన జామకాయలు నవులుకుంటూ, ఏవో కబుర్లాడు కొంటూ బయల్దేరాం.

"చూడు ఆశీర్వాదంగారి అరుపు విన్పిస్తుంది" అన్నాడు రజీ ఉత్సాహంగా.

కాని ఎంతదూరం నడిచినా మాకు అరుపు విన్పించడం లేదు. రజీ మొదట గాభరాపడ్డాడు. అంతలో నవ్వేసి "బహుశా నిద్దరపోయి వుంటారు" అన్నాడు.

మాస్థలానికి వచ్చాక రజీ కొవ్వొత్తి వెలిగించాడు. అంతా చీకటిగావుంది. ఆవెలుగులోమాత్రం వస్తువులన్నీ చెదిరిపోయినట్టు కన్పించాయి. సిపాయి కిట్‌బాగూ, మిగతా వస్తువులూ, కప్పులూ, బట్టలూ అన్నీ ఎవరో కెలికేశారు. రజీకి, నాకూ భయంవేసింది 'రజీ!' 'హాోయ్,' అని గట్టిగా అరిచాడు. కొండ దగ్గర్నుంచి ప్రతిధ్వనివచ్చింది. ఎవ్వరూ పలకలేదు.

"ఆయన వెళ్ళిపోయేరేమో!" అన్నాను నేను.

"నన్ను తీసికెళ్ళకుండా వెళ్ళిపోరు" అన్నాడు రజీ. "నువ్వొ వెదుకు.ఎక్కడో నిద్రపోయి వుంటారు." అనిమరో కొవ్వొత్తి వెలిగించి యిచ్చాడు. నాకంతా భయంగావుంది. అయినా తప్పక వెదికాను ఆయన్ని పేరుపెట్టి పిలుస్తూ. అలా గంటపయిగా వెదికాం. చివరికి రెండు చింతచెట్లమధ్యకివచ్చా న్నేను. మరో నిముషంలో కొవ్వొత్తి ఆరిపోయేటట్టుంది. అప్పటికే మాస్థలానికి చాలాదూరం వచ్చేశాను. ఆ చీకట్లో

ఏకో కీచురాళ్ళ అరుపులుతప్ప యింకేం వినిపించడంలేదు. "రజీ!" అని అరిచాడు. ఎక్కడా అలికిడిలేదు. నా తలమీద గుడ్లగూబ అరిచింది, అంతే. కొవ్వొత్తి పట్టుకు ఒకటే పరుగు తీశాను. పదడుగులు వేశానోలేదో దేన్నో తన్నుకుని ముందుకి పడిపోయేను. కాళ్ళకీ చేతులకీ దెబ్బలు తగిలాయి. "రజీ!" అని అరిచాను గట్టిగా. ఎవ్వరూ పలకలేదు. లేవలేక అలాగే పడివుండిపోయేను చాలాసేపు. కొంతసేపటికి నన్ను వెదుక్కొంటూ రజీయే వచ్చాడు. పిల్చాడు. వాడి కొవ్వొత్తి యింకా వెలుగుతూనే వుంది.

"ఇక్కడ పడిపోయావేం?" అన్నాడు.

చీకటిలో ఏదో తన్నేసుకున్నాను, భలేదెబ్బతగిలింది."

కొవ్వొత్తి వెలుగులో 'ఏమిటా?' అని వెదికాము యిద్దరం. వెంటనే భయంతో రజీ కెవ్వున అరిచాడు. "ఇదుగో! ఆశీర్వాదంగారు!"—

వెంటనే కొవ్వొత్తి నాచేతికిచ్చి గుండెమీద చెవి ఆనించి చూశాడు. చుట్టూ ఆకులన్నీ పోగుచేసి పెద్ద మంట వెలిగించాడు. ఆ మంటవెలుగులో ఆశీర్వాదంగారు స్పష్టంగా కన్పించేరు. ఆయన బుజంమీదా, నుదురుమీదా, కడుపు మీదా పెద్ద గాయాలున్నాయి రక్తంతో మొహమంతా తడిసిపోయింది.

ఆశీర్వాదంగారు చచ్చిపోయేరు

రజీ పిచ్చెత్తినట్టు అతన్ని జాగ్రత్తగా చూస్తూకూచు న్నాడు. అతన్ని చంపేసి ఎక్కడ్నుంచో యీడ్చుకొచ్చి యిక్కడ పడేశారు. బహుశా తుపాకీతో కాల్చేసివుంటారు.

నానణుకు యిక చెప్పలేను. మోకాళ్ళమధ్య తలఆనించి కూచున్నాను కొంతసేపటికి తలెత్తేసరికి రజీ ఏడుస్తూ కన్పించాడు. అంతకుముందు వాడు ఏడవడం నేనెప్పుడూ చూడలేదు.

"ఎవరు చంపేసి వుంటారంటావ్?" అన్నాను ఎంతో సేపటికి—

"ఏమో తెలీదు. తుపాకీ ఎక్కడన్నా కన్పిస్తుందేమో చూడు" అన్నాడు.

అంతటా వెదికాను. కాని ఎక్కడా ఆశీర్వాదంగారి తుపాకీ కన్పించలేదు.

"ఈయన తుపాకీకూడా కన్పించలేదు" అన్నాడు.

ఇద్దరం అలా మాట ఆరిపోయేవరకు కూచున్నాం. రజీని ఏడవవద్దని ఎన్నోసార్లు చెప్పేను. మళ్ళీ యిద్దరం మా స్థలందగ్గరికి వచ్చేశాం. వెదగ్గా వెదగ్గా ఆయన సంచీదగ్గరే మాకో కాగితం దొరికింది:

ప్రియమయిన రజీ!

శత్రువులు పోలికపట్టేశారు. నేను వెళ్ళిపోతున్నాను. సరిగ్గా ఆదివారం బెజవాడలో కలుస్తాను

—ఆశీ.

"వెళిపోదామను కొంటూంటే ఎవరో పసిగట్టి చంపేశారు" అన్నాడు రజీ.

అప్పటికి నాలుగయింది. తెల్లవారేవరకూ అక్కడే పడుకుని యింటికి వచ్చేశాను. ఈవిషయంమాత్రం ఎవరికీ

చెప్పలేదు. నాలుగురోజులవరకూ వెళ్ళనని పట్టుబట్టి బడి మానేశాను.

తర్వాత పోలీసులు లోయతోటకి వెళ్ళారనీ, శవాన్ని ఆసామాన్లనీ తీసుకుపోయేరనీ, రజీ అనేకుర్రాణ్ణి కూడా జైల్లో పెట్టేరనీ బాబాయి చెప్పేడు.

"నే చెప్పలా! వాడు వట్టి వెధవ?" అన్నాడు బాబాయి.

"ఓసారి రజీని చూసివద్దాం బాబాయ్" అన్నాను. మళ్ళీ ఆమాటఅంటే చితకతంతానన్నాడు. ఇక మాట్లాడక వూరుకున్నాను.

మరి నెలరోజులకి రజీని వదిలేశారని తెల్సింది. ఆశీర్వాదం గార్ని గురించి ఏం చేశాగో తెలీలేదు. రజీ మళ్ళీ ఎక్కడన్నా కన్పిస్తాడేమోనని సాయిబు కొట్టుకి వెళ్లాను. ఎక్కడా కన్పించ లేదు. ఎవ్వరూ చూడకుండా లోయతోటకి వెళ్లాను. అక్కడా లేడువాడు. అక్కడంతా ఖాళీపడివుంది స్థలం.

ఇంటికి వచ్చేశాను.

# 16

ఎన్నో రోజులు గడిచిపోయేయ్. బాగా వర్షాలుపడు తున్న రోజులవి. అటువంటి సమయంలో ఓనాటి సాయం కాలం వర్షంలో తడిసిపోతూ వచ్చి మా అరుగుమీద కూచ్చున్నాడో కుర్రాడు. బాబాయి లోపల వంటప్రయ త్నాలు చేస్తున్నాడు. చలిబాగా వేస్తోంది. వాళ్ళంతా ముడుచుకూర్చున్నాడు. తొంగితొంగి లోపలికి చూస్తున్నాడు అప్పుడప్పుడు. లోపలకూచుని చదువుకుంటున్నానేను. బయట ఏదో అలికిడిఅవడంతో అటు చూసేను.

"ఎవరదీ?"

"నేను"

"నేనంటే"

"రజీ?"

అంతే-ఒక్కఉదుటున వాడిదగ్గరపడ్డాను."రజీ!" అనరిచాను. "బాగా చలివేస్తోంది. నీలాగూ,లాల్చీ వుంటేయియ్" అన్నాడు. వెంటనే లోపలికి పరిగెత్తుకువెళ్లి తెచ్చియిచ్చేను.

"ఇన్నాళ్ళూ ఎక్కడికి పోయేవ్?"

"ఏమో తెలీదు"

"నీకే తెలీదా!"

"చాలావూళ్లు తిరిగాను.ఎక్కడెక్కడ తిరిగానో జ్ఞాపకం లేదు.బందరువెళ్ళాను ఓసారి. అక్కడ ఆశీర్వాదంగారి తమ్ముడున్నాడు. ఆశీర్వాదంగారు తెలుసుగా!"

"తెలుసు"

"తర్వాత అక్కడ్నుంచికూడా వచ్చేశాను. దారిలో జ్వరం వచ్చేసింది"

"జ్వరం వచ్చిందా! అప్పుడేం చేశావ్?"

"వొళ్ళంతా వేడిగావుందని రైలుస్టేషన్లో చల్లటి నీళ్లు స్నానం చేసేశాను.వెంటనే నిద్రపట్టేసింది.పడుకున్నాను. మరి నాలుగురోజులదాకా తెలివిరాలేదు. మేలుకునేసరికి ఎవరో సాధువులదగ్గర వున్నాను. వాళ్ళు నావొళ్ళంతా ఏదో బూడిద పట్టించారు. మరో పదిరోజులకి తగ్గిపోయింది జ్వరం"

"తర్వాత?"

"తర్వాత యింకేమీలేదు. యిక్కడికి వచ్చేశాను"

"మరింకెక్కడికి వెళ్ళకు" అన్నాన్నేను.

"అలాగే"

"ఆకలి వేస్తోందా?"

"ఊఁ"

"అయితే బాబాయితో చెప్పివస్తానుండు"

"నేనంటే కోపగిస్తాడేమో?"

"పర్వాలేదులే. నేను చెప్తాను" అంటూ లోపలికి వెళ్ళాను.

బాబాయితో చెప్పాను. అట్టే యిష్టం లేకపోయినా అంతా విన్నాక "సరే. లోపలికి రమ్మను" అన్నాడు. ఆగది లోనే రజీకి పక్క వేశాను.

మరో పదిరోజులు మాత్రం అక్కడ ఉన్నాడు వాడు. వర్షాలుతగ్గుముఖం పట్టగానే లోయతోటలోకి వెళ్ళిపోయేడు. సాయిబుదగ్గర టోపీలు కుట్టడం ప్రారంభించాడు.మరికొన్నాళ్ళ వరకూ గల్లంతులేవీ చెయ్యకుండానే గడిపేశాం.అప్పుడప్పుడు వాడినికల్సుకునేవాడిని. ఆ మాటా యీ మాటా చెప్పుకునే వాళ్ళం.తర్వాత వాడు తోటలోకి పోయేవాడు.

ఆయేడు నిర్మలా, నేనూ పరీక్ష ప్యాసయాము. ఈ సంగతి యిద్దరం కలిసివెళ్ళి రజీతో చెప్పాం. మర్నాడు మా యిద్దరికీ వాడు రెండు ఏపిల్‌పళ్ళు తెచ్చియిచ్చాడు.

ఏది ఎలావున్నా రజీ స్థిరంగా ఉండలేకపోయేడు. కొన్నాళ్ళు ఎవరో సాధువుని తెచ్చి వాడినితోటలో వుంచి భోజనంపెట్టూండేవాడు. నన్నుకూడా అక్కడికి రమ్మన్నాడు. ఏదో ఉపదేశాలు చేస్తానన్నాడు. ఆ సాధువుదగ్గర మంత్రాలు కూడా ఉన్నాయిట.

నేనుమాత్రం వెళ్ళలేదు ఆసాధువు మొహంచూడగానే నాకు అనుమానం వేసింది. సాధువుల్లో సాధారణంగా దొంగ సాధువులుంటారని బాబాయి చెప్పాడు. అందుచేత నేనటు వేపు వెళ్ళలేను. తర్వాత ఓనాడు రజీ దాచుకున్న డబ్బు పట్టుకు పారిపోయాడని తెల్సింది. నేననుకున్నది నిజమేనని పించింది.

మరికొన్నాళ్ళు చిలకని పెంచాడు రజీ. దానికిమాటలు నేర్పేవాడు. బుజంమీద వుంచుకుని వూరంతా తిరిగేవాడు. దానికాళ్ళకి యిత్తడి కడియాలుతొడిగాడు. చక్కని పంజరం చేయించాడు. రాత్రీపగలూ దాన్నివదిలేవాడు కాదు. కాని ఓ రోజువాడు సాయిబుకొట్లో టోపీలుకుడుతూండగా ఓపిల్లి దాన్ని మింగి ఊరుకుంది. అక్కడితో చిలకకథ అయిపోయింది. ఆపిల్లిని రజీ ఎన్ని తిప్పలు పెట్టాడో చెప్పలేను.

ఈసారి పాలపిట్టను పెంచాడు. అదీ ఎగిరిపోయింది కొన్నాళ్లు ఉన్నట్టేవుండి.

ఓరోజు ఉదయమే నాదగ్గరికి వచ్చాడువాడు.

"రెండురూపాయలుంటే కావాలిరా" అన్నాడు.

"ఎందుకూ?"

"కావాలి"

"నాతో చెప్పకూడదా!"

"నూజివీడుదగ్గర చాలా యిల్లు కాలిపోయేయిట. ఇల్లు లేక చాలామంది ఏడుస్తున్నారు"

"అయితే!"

"వాళ్ళకి సహాయం చెయ్యాలి"

"ఈ రెండు రూపాయల్తో యింతచిన్నవాడివి నువ్వేం? సహాయం చేస్తావ్?"

"చిన్నవాళ్లు సహాయం చెయ్యలేరా యేమిటి?"

"హాయిగా యిక్కడేవుండు. ఎక్కడికీ వెళ్ళకు"

"వెళ్లనీరాలి. నీకు తెలీదు. ఉంటే రెండురూపాయలు, యియ్యి"

చివరికి ఎలాగో సంపాయించి రెండురూపాయలూ యిచ్చాను.

"ఇది అప్పుకాదు" అన్నాడు.

"సరేలే"

"నీలాంటి స్నేహితుడు నాకెప్పుడూదొరకడురా" అన్నాడు. ఇద్దరం ఒకరినొకరం విచిత్రంగా చూసుకున్నాం. అంతే. వెనక్కి తిరిగిచూడకుండా పారిపోయాడు రజీ. వాడు కన్పించేవరకూ అలానే చూస్తూ నిలబడ్డాను.

# 17

మరి ఎన్నాళ్ళయినాతిరిగిరాలేదు రజీ. నేను గాభరా పడ్డాను. రోజూ వాడికోసం ఎదురుచూసేవాణ్ని. అప్పుడప్పుడు లోయతోటకి పోయిచూసేవాణ్ని. కాని వాడు కన్పించలేదు. లోయతోట ఎవరికో కౌలుకిచ్చేశారు.ఇప్పుడక్కడ పొలాలూ, విరిగిన చెట్లూ మిగిలాయి.

రెండేళ్ళు గడిచిపోయేయి. నేను పెద్దవాణ్నయాను—

క్రమంగా రజీని అవూళ్ళో అంతా మరిచిపోయేరు. కానీ సాయంకాలం ఆపడవచూసినప్పుడూ, ఆలోయతోటకివెళ్ళిన

నప్పుడూ రజీ జ్ఞాపకం వచ్చేవాడు. ఒక్కోరోజు వాడికోసం గంటలతరబడి ఆలోచిస్తూ అలానే పడవదగ్గర కూర్చొనే వాణ్ని.

నాతోపాటు వాడిని మర్చిపోనివ్యక్తి మరొకతె వుంది- నిర్మల. ఇద్దరం మామిడితోటలో కూచొని రజీ విషయాలు చెప్పుకునే వాళ్ళం.

చీకటిపడగానే ఇళ్లు చేరేవాళ్ళం—

కొన్నాళ్ళకి నిర్మలని చదివించడం మానేశారు. ఎప్పుడూ ఆమెఇంట్లోనే ఉండిపోయేది. ఎప్పుడన్నా వీధి లోంచి పోతూంటే గుమ్మంలో కన్పించేది. కన్పించినప్పుడల్లా పలకరించి ఏదో మాట్లాడేది.

కిట్టుడూ, రాం, రాజీ, కన్నా .అంతావిడిపోయాం, కొందరు యీవూరునుంచి వెళ్ళిపోయేరు.

నేనుమాత్రం ఆరోడ్ల వెంటతిరుగుతూ చిన్నతనాన్ని జ్ఞాపకం చేసుకొంటూ ఉండేవాడిని.

క్రమంగా బాబాయి నీరసించిపోయేడు-అతనికి గుండె జబ్బుచేసింది-రోజు రోజూ అధికమయింది. గాలిమార్పుకోసం మరోవూరు వెళ్ళవలసివచ్చింది.

చివరిసారిగా నిర్మలని కలుసుకుని మాట్లాడాను. ఆనాటి సాయంకాలమే బాబాయితో రైలెక్కి పోయేను.

రైల్లో కూర్చున్నంతసేపూ ఎన్నివిషయాలు జ్ఞాపకం వచ్చాయో చెప్పలేను. మా ఆటలూ, ఆశీర్వాదంగారూ, స్వర్క-సూ, నాటకంవిషయం-అన్నీను.

రైలు దిగేసరికి బాగా చీకటిపడింది. ఆస్టేషన్లో అట్టే మంది మనుష్యులు దిగలేదు. బాబాయిముందు నడుస్తున్నాడు. నిద్రమత్తులో తొందర తొందరగా అడుగులు వేస్తున్నాను. ఆతొందరలో నే రోడ్డు ప్రక్కన పడుకున్న ముష్టివాడి కాలు తొక్కేశాను. అమ్మా అని మూలిగాడు వాడు. నామనస్సు చివుక్కుమంది.

"ఏంకావాలిరా నీకు?" అన్నాను.

"నీళ్ళు-మంచినీళ్ళు పొయ్ తమ్ముడూ" ఆగి ఆగి అడిగాడు. ముందుపోతున్న బాబాయిని పిలిచాను. "ఆ ముష్టి వాడికి మంచినీళ్లు కావాలిట బాబాయ్".

"పోనిద్దూ వెధవలు. టక్కరి వేషాలు వేస్తారు"-అని విసుకున్నాడు.

వాణ్ని విడిచిపెట్టి పోబుద్ధి వెయ్యలేదు నాకు.

"నేను పోసి, వస్తాను" అంటూ బాబాయిచేతిలో చెంబుతీసుకు వెనక్కి వచ్చాను.

ముష్టివాడి తలఎత్తి నోట్లో నీళ్ళు పొయ్యబోయేను. కళ్ళువిప్పాడువాడు. వాణ్ని ఆ వెలుగులో చూసి దిగ్భ్రాంతుడ్నయాను. వాడు నన్నుచూసి ఏదో అన్నాడు.

వాణ్ని మరీదగ్గరగా గమనించాను. వాడితల నాచేతిలోంచి మెల్లగా జారిపోయింది—

నేను పరిగెత్తి బాబాయి దగ్గరికి వచ్చాను.

నాకు వూపిరి ఆడడంలేదు. మాటలు తడబడ్డాయి మెల్లగా వినిపించీ వినిపించనట్టు అన్నాను.

"రజీ చచ్చిపోయేడు బాబాయి!"

---